గోపాలాచార్లు, డి

అధ్యక్షకాభిభాషణములు

చెన్నపురి, 1916

Record no. 207

## Bibliographic Record Target

గోపాలాచార్లు, డి.

అధ్యక్షకాభిభాషణములు / వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు.- చెన్నపురి : ఆయుర్వేదాశ్రమ ముద్రాక్షరశాల, 1916.

78, 5, (1), 6, (2) p. (1) leaf of plate. :port;18 cm.

Record no. 207

Gōpālācārlu, Ḍi.

Adhyakṣakābhibhāṣaṇamulu / Vidyaratna paṇḍita Ḍi. Gōpālācārlu.- Cennapuri : Āyurvēdāśrama Mudrākṣaraśāla, 1916.

78, 5, (1), 6, (2) p. (1) leaf of plate. :port;18 cm.

Record no. 207

ఆయుర్వేదాశ్రమ గ్రన్థమాల—౧౦.



శ్రీరస్తు.

కేరళ ఆయుర్వేద సమాజము సప్తమసమావేశనము

కొల్లంగోడు.

31 జనెవరి, 1 ఫిబ్రవరి 1909.

అఖిలభారతవర్షీయ ఆయుర్వేద మహాసమ్మేళనము

బొంబాయి.

19 - 20 - 21 ఏప్రియల్ 1913.

# అధ్యక్షకాభిభాషణములు.


అధ్యక్షులు

ఆయుర్వేద విద్యాపీఠ సభానాయకులును,

చెన్నపురి ఆయుర్వేదకాలేజి ప్రిన్సిపాలునునగు

శ్రీమాన్,

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి

వైద్యరత్న పండిత, డి. గోపాలాచార్లు,

ఎ. వి. ఎస్.






చెన్నపురి,

ఆయుర్వేదాశ్రమ ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపబడియె.

రిజిస్టర్డు-కాపిరైటు.] ౧౯౧౬. [వెల రూ. ౦-౬-౦.

MADRAS.
PRINTED AT
**THE AYURVEDIC PRINTING WORKS,**
*55, Acharappen Street, George Town,*
AND PUBLISHED FROM
AYURVEDASRAMA, MADRAS.

# విజ్ఞాపనము.

పాఠక మహాశయులారా!

గడచిన 1909 సంవత్సరమున ఆనరబుల్ శ్రీ వాసుదేవ రాజావారి రాజధానియగు కొల్లంగోడు సంస్థానము (కేరళ దేశము) న జరిగిన కేరళ ఆయుర్వేదీయ సప్తమ మహాసమావేశమునను 1913 వత్సరము బొంబాయి పురమున జరిగిన అఖిలభారతవర్షీయ ఆయుర్వేద మహాసమ్మేళనమునను అధ్యక్షుకతవహించిన శ్రీమాన్, వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు, ఎ. వి. ఎస్., ఎ. ఎం. బి. మహాశయులు సంస్కృతభాషయం దొసగిన ప్రారంభోపన్యాసములను గత డిసెంబరు మాసమున చెన్నపురియందు జరిగిన అఖిలభారతీయాయుర్వేద సప్తమ మహాసమ్మేళనమునకై యరుదెంచిన యనేకాన్ధ్రదేశ వైద్యుల యొక్కయు ఆయుర్వేదాభిమానుల యొక్కయు కోరికవలన శ్రీమదాచార్యులవారి యనుమతిని వడసి వారి శిష్యబృందములో నొకడగు నేను ఆన్ధ్రమున నుపన్యాససారముగ వ్రాసి యిందు ముద్రించినాడను. ఇందలి తప్పులున్నచో మన్నించ వేడుకొనెదు,

భవద్విధేయుడు,
భిషగ్వర. ఎమ్. రామమూర్తిశాస్త్రి.



వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు,
ఎ. వి. ఎస్. అండ్ ఎ. ఎమ్. బి.

శ్రీ కేరళీ యాయుర్వేద సమాజానుబంధముగా

సప్తమ వైద్యమహాసమ్మేళనమున నగ్రాసనాధిపతులగు

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి,

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారిచే

కొల్లంగోడు సంస్థానమున నొసగబడిన

# యభిభాషణము (అ.డ.స్.)

## 1909.

---

ఆయుర్వేదవిశారదులారా !

పండితాగ్రగణ్యులారా !

సభాసదులారా !

తామందరును నన్ను సభకగ్రాసనాధిపతిగ నుండగోరుచు ఇచ్చటి కాహ్వానము జేసి నాకొక నూతనగౌరవమును కలిగించుచు నన్ను యగ్రాసనాధిపత్యమును వహింప నియోగించుచున్నందుకు సభాస్తారులగు మీకందరకు ననేకప్రణతుల నాచరించువాడ.

నే నీయధికారమునకు తగుదునని తలంపను. అయినను ఆనరబుల్. దివాన్ బహదూర్. ఆర్. వి. శ్రీనివాసఅయ్యార్, బి. ఏ., సి. ఐ. ఇ., ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ రిజస్ట్రేషన్ వారి ప్రోత్సాహబలముచే సంజాతకుతూహలులై శ్రీకొల్లంగోడు

యువరాజులగు మాధవరాజ చూడామణిగారు సాదరముగ నాహ్వానము చేయుటచే శ్రీవారి యాహ్వానమును నిరాకరింపజాలక ఆయుర్వేదవిద్యావైభవ ప్రచారమున నత్యాదరులును పూజ్యులునగు తామందరియొక్కయు నిర్హేతుక కటాక్షము నాధారముగ జేసికొని యిందు కృతకృత్యుడను కావచ్చునని నిశ్చయము కలిగినవాడనై ఇట్టిభారమును వహింప నశక్తుడనైనను సాహసించి తమనియోజనమును నిర్వహింపగడంగితిని.

ఇట్లీకార్యంబున నే గడంగినవాడనగుట నీసాహసకృత్యమును నిర్వర్తించుటకు మిగుల నానందముగ నున్నయది.

ఈయధికారమును వహించిన నావలనగూడ తమకందరకును అత్యధికమగు నానందము కలుగుగాకయని యాశాసించుచున్నవాడ.

ఈ మన భరతఖండమున నానావిధములగు కారణములచే నీరసావస్థనందిన శాస్త్రశిల్పాదులతో బాటుగ నీరసావస్థనందిన యాయుర్వేదమును మరల నుద్ధరింప తలంపుగొని విద్వద్వర్యులగు తామందరును ఈసభను స్థాపించి మనయొక్కయు మనశాస్త్రములయొక్కయు భావ్యభివృద్ధికి మంచియవకాశము నొసంగుటచే మిగుల గొప్పదియగు నీకార్యము నాచరించు విషయమున తమకందరకును నా మనఃపూర్వకములగు నభినందనముల నందించుచున్నాడను.



“ ఋగ్వేదస్యోపవేదోయమ్ ” అని చరణవ్యూహమున జెప్పబడియుండుటచేతను ఋగ్వేదమునందే అచ్చటచ్చట బహువిధములగు చికిత్సలను ప్రతిపాదించు శ్రుతివాక్యము లనేకము లగుపడుచుండుటచేతను ఈ యాయుర్వేదము వైద్యకతంత్రము లన్నిటికంటె మొదట నుత్పన్నమైనదని స్పష్టముగ దెలియుచున్నది.

ఇట్లతిప్రాచీనమగు నీయాయుర్వేదము పరాత్పరుడాదిగ బయలువెడలి బ్రహ్మ దక్షుడు అశ్వినులు ఇంద్రుడు ఆత్రేయుడు భరద్వాజుడు మొదలగువారినుండి ధన్వంతరివరకు శుక్లపక్షగతుడగు చంద్రునిమాడ్కి పరంపరగ నభివర్ధితమగుచువచ్చెను.

ఇటుల నధ్యాయ సహస్రపరిమితముగ నభివృద్ధమైన యాయుర్వేదము జనుల సౌలభ్యముకొరకు :—

1. శల్యతంత్రము = (Science of Surgery.)
2. శాలాక్యతంత్రము = (Science of Eye, Nose, Throat &c. Diseases.)
3. కాయచికిత్స = (General Treatment.)
4. భూతవిద్య = (Demoniacal Diseases.)
5. కౌమారభృత్యము = (Management of Children.)
6. అగదతంత్రము = (Texicology.)
7. రసాయనతంత్రము = (Science of Reguvoration.)
8. వాజీకరణతంత్రము = (Science of Aphrodisiacs.)

అని విపులముగ నెనిమిది భాగములు కలిగినదిగ విభజింపబడినది

పై జూపబడిన ట్లుష్టవిధములుగనుండు చికిత్సావిధాన ములకును ఋగ్వేదమున ననేక ప్రమాణవచనము లగుపడు చున్నవి. అయినను విస్తరభీతిచే నిట గొన్నిటినిమాత్రము దృష్టాంతరములుగ జూపుచున్నాడను.

ప్రథమాష్టకమున :—"సద్యో జంఘాం ఆయసీం విశ్ప లాయై" అని శస్త్రచికిత్సావిషయమునను "తస్మా అక్షీనా సత్యావిచక్ష ఆధత్త" అని శాలాక్యతంత్రమునకు చేరిన ఊర్ధ్వాంగ చికిత్సావిషయమునను "యువంచ్యవానమశ్వినా జరంతం పునర్యువానం చక్రథు శ్చచీభిః" అని రసాయనతంత్ర విషయమునను "త్రిధాతుశ్శర్మవవహతం శుభస్పతిః" అని త్రిదోష శామకతారూపమగు కాయచికిత్సావిషయమునను ప్రమాణములు ఋగ్వేదమున కలవు

దీనిని బట్టి విచారించి చూచితిమేని యిప్పటి పాశ్చాత్య వైద్యవిద్యలయందు ప్రసిద్ధములైయుండు శస్త్రచికిత్సాదులు గూడ ఆయుర్వేదతంత్రమున విస్తారముగ వివరింపబడినవియే యని స్పష్టముగ తోచుచున్నది.

ఇట్లు సర్వవిధములగు చికిత్సలును ఈయెనిమిది తరగ తులయం దంతర్భూతములై యాయుర్వేదముచే తెలియదగి నవిగనున్నవి.

ఇట్లు వైదికకాలాంతముదనుక ఋషిపరంపరయందు వ్యాప్తమై యభివృద్ధినందిన యాయుర్వేదమును శ్రీ చరకా



చార్యులు క్రైస్తవశకమునకు మున్నూరు వత్సరములపుడు (300 B.C.) పంచనద (పంజాబు) ప్రాంతముననుండు తక్షకశిలా నగరమున కాయచికిత్సావిధానము ననేకులగు శిష్యుల కుపదే శింపుచు నభివృద్ధికిం దెచ్చెను.

పిమ్మట క్రైస్తవ నాలవ శతాబ్దమున (400 A. D.) ధన్వంత్యర్య పరావతారభూతుడును దివోదాసనామకుండును నగు కాశీరాజు కాశీనగరమున ఔపధేనవాదులగు తనశిష్యుల కనేకులకు శస్త్రచికిత్సాపద్ధతుల నుపదేశింపుచు నాయుర్వేద మును పెంపొందించెను.

కొంతకాలము చనిన యనంతరమున సింధుదేశమున నివసింపుచుండిన వాగ్భటాచార్యుడు వైదికవైద్యగ్రంథశిరో భూషణమనందగి ఆసేతుశీతాచలమును "వాగ్భట" మను పేరున ప్రసిద్ధమైయుండు "అష్టాంగహృదయము"ను ఇంకను కొన్ని గ్రంథములను వైద్యవిద్యా విషయమున క్రైస్తవ పంచమశతాబ్దమున (500 A D.) రచించి వన్నెగాంచెను.

ఇట్లు ఆయుర్గ్రంథముల రచనాకాలమును పరిశీలించి చూడ స్వతంత్ర వైదికవైద్య గ్రంథరచనమునకు వాగ్భటకా లమే అంతిమమని యూహింపదగియున్నది.

వైదికకాలమున కనంతరమున నాగార్జున కాపాలి భాలుకి ప్రభృతులగు వార్తికులు స్వల్పపరిమితిగల యౌషధములచేతనే

రోగముల దనుమాడు నుపాయము నన్వేషించి యుపదేశింప దలపెట్టి అభ్రికము స్వర్ణము మున్నగు ఖనిజ వస్తువులయందలి నల్పగుణమును కనుగొని జారణమారణాది ప్రక్రియావిశేషములచే వానికి భస్మము సిందూరము సత్వపాతనము ద్రుతిబద్ధములుగ రూపాంతర పరిణతిని కల్పించి ఆయా రోగములయందుపయోగింపదగు ప్రక్రియల నేర్పరచి యత్యల్పమగు మాత్ర (మోతాదు) చేతనే రోగములనణచు నుపాయము నుపదేశించిరి. క్రైస్తవ శకమునకు రెండు మూడు శతాబ్దములకు పూర్వపువారలగు చంద్రగుప్తుడు అశోకుడు మున్నగు చక్రవర్తులకాలమున నీ తాంత్రికమతప్రకాశకులగు నాగార్జునాదులచే నీయాయుర్వేదమున రసతంత్రములు ఎంతయు నభివృద్ధికి తేబడెను. అదిమొదలుగ నీయాయుర్వేదము తాంత్రికమని ప్రసిద్ధినొందెను.

ఇట్లత్యధికాభివృద్ధినంది సంస్కృతభాషామయమైయుండు ఆయుర్వేదవిద్యను గ్రీక్కులును అరబ్బులును ఆంగ్లేయులును యెనిమిదవ క్రైస్తవ శతాబ్దమునకు పూర్వమె తమతమభాషలయందు పరివర్తనము నందించిరి.

పిమ్మట కొంతకాలము గడచుటయు ననేకములగు కారణములచే సంస్కృతభాషావ్యాప్తి తగ్గి యీ యాయుర్వేదవిద్య లుప్యమానావస్థ నందుచుండుటయు నప్పుడప్పుడు చక్రపాణి పూజ్యపాదుడు భావమిశ్రులు మాధవకరుడు వల్లభేంద్రుడు



బసవరాజు మొదలగు వైద్యాచార్యులు గ్రంథాదిరచనాముఖమున గొంతయుత్తేజన మొసంగుచుండుటయు సంభవింపుచు వచ్చినను పాఠకులును అధ్యేతలును తగ్గుచుండుటచే యథాక్రమమున మందప్రచారమగుచు మొత్తమువిూద నశించునట్టి యవస్థకు బాల్పడినదయ్యెను. అట్టితరుణమునగూడ మనపూర్వరాజులు ప్రాచీనమార్గము ననుసరించి వేదముల నుద్ధరించిన పగిదినే వేదాంతర్గతమగు నీ యాయుర్వేదమును గూడ రక్షింపుచు మిక్కిలి ప్రయత్నముచే పోషించుచుండిరి.

ఇట్లైనను కొంతకాలమున కీయాయుర్వేదము స్మరణీయావస్థకు వచ్చుటయు నిక్కాలపువారిలో కలకత్తానగరమున నుండు సర్వతంత్రస్వతంత్రులును ఆయుర్వేదోద్ధారకులునునగు చరక చతురానన గంగాధర కవిరాజవర్యులచే చరక సుశ్రుతములకు వ్యాఖ్యానములువ్రాసి ప్రచారమునకు తేబడుటచేతను భిషజ్మకుటామలమణి మహామహోపాధ్యాయ కవిరాజద్వారకానాథసేన్ కవిరత్నమహాశయులు మహామహోపాధ్యాయ విజయరత్నకవిరంజన్ ప్రభృతులగు వారి శిష్యులనేకులచే నాయుర్వేదము లక్ష్యలక్షణవిజ్ఞానపురస్సరముగ నుపదేశింపబడుచుండుటచేతను వంగదేశమునను తత్పరిసరములను ఈవిద్య మరల మొలకలెత్త నారంభించెను.

బొంబాయినగరమున భారతభూషణ. ఆనరబుల్. డాక్టర్, సర్. బాలచంద్రకృష్ణ, కె. టి. ఎల్. ఎమ్. జే. పి భారత

భూషణ; డాక్టర్, దేశముఖ్, ఎమ్. ఏ, ఎమ్. డి, ప్రభృతులచే పన్నెండు వత్సరములకు పూర్వమే ఒక ఆయుర్వేదవిద్యాలయము స్థాపితమై యందు చదువువారలకు పాశ్చాత్యమతానుసారములగు అనాటమీ ఫిజియాలజీలనుచేర్చి లక్ష్య లక్షణాత్మకముగ నాయుర్వేదవిద్య యుపదేశింపబడుచుండుటచే నాప్రాంతముల నీవిద్య చిగురెత్త మొదలిడెను.

మరియు శ్రీ.శ్రీ.శ్రీ. దర్భాంగమహారాజుగారు డాక్టర్ సర్. భాలచంద్రకృష్ణ ఆయుర్వేద మహోపాధ్యాయ శంకరదాజీపదె ప్రభృతుల ప్రోత్సాహ బలముచే శ్రీ. శ్రీ. శ్రీ. బరోడామహారాజుగారి పోషణమున నాసికపురమున "శ్రీసయాజీ ఆయుర్వేదవిద్యాపీఠమను నొక సభనేర్పరచి దాని మూలముగ నాయుర్వేదవిద్యాభిమానులకు కుతూహలమును ప్రోత్సాహమును నొసంగుచుండుటచే బొంబాయి ప్రాంతమునను మధ్యరాష్ట్రమునను ఈవిద్య వ్యాపించి యల్లుకొనుచుండుట మన కగుపడుచునేయున్నది.

చెన్నపురియందును శ్రీకన్యకాపరమేశ్వరీ సభాసదులు ఆయుర్వేదకలాశాలను వైద్యశాలను స్థాపించి ఇప్పటికి పదునొకండు వత్సరములుగ పంజాబు బెంగాలు హైదరాబాదు మైసూరు కేరళము మొదలగు ప్రాంతములనుండి వచ్చి చదువుచుండు విద్యార్థులకు విద్యార్థివేతనములను గూడ నేర్పరచి ఆంగ్లమతానుసారముగ అనాటమీ ఫిజియాలజి ఫిజిక్సు



కెమిస్ట్రీ మెటీరియామెడికా మెడిసన్ మిడ్వైఫరీ హైజీన్ మున్నగు విషయములను కూడ చేర్చి సానుభవముగ నాయుర్వేదాధ్యాపనమును చేయించుచున్నారు.

గౌరవనీయులైన వి. కృష్ణస్వామయ్యర్, సి. ఎస్. ఐ. గారు చెన్నపురియందలి మైలాపురమున ఆయుర్వేద పాఠశాలను, వైద్యశాలను నెలకొల్పి మూడువత్సరములుగ విద్యాభ్యాసము జరిగించుచున్నారు.

ఆర్యవిద్యలకు ప్రధాననికేతనమై విలసిల్లుచుండు మైసూరు నగరమున సకలకలలను అధ్యాపనము చేయించుటకొక మహాకలాశాలను మహారాజాగారు స్థాపించియున్నారని అందరెఱింగినదియేకదా? అచ్చట నాయుర్వేదము నుపదేశించుటకు వేరుగ నొకకలాశాల స్థాపితమైనదనువిషయము ఆయుర్వేదాభివృద్ధి కత్యంతోపయుక్తమైనది. ఇట్లు ఈ ప్రాంతములయందు ఈవిద్య పుష్పితత్వ ఫలితత్వావస్థల నందుచున్నదని చెప్ప కుతూహలముగనున్నయది.

ఈపద్ధతి ననుసరించి మహారాజులు రాజులు జమీందారులు మొదలగు వారలందరును తమ తమ రాష్ట్రముల యందు ఆయుర్వేదకలాశాలలను స్థాపించి విద్యార్థులను చదివించుచుండిరేని అత్యల్పకాలముననే ఆయుర్వేద మనల్పాభి

వృద్ధినంది దిగంతములయందు వ్యాప్తి నందునని నిశ్చయముగ జెప్పవచ్చును.

పై జెప్పబడినయట్లు కొంతకాలము క్షీణదశనంది తిరిగి వృద్ధినందుచుండు నీయాయుర్వేదమును తగు దోహదమునొసంగి యథాక్రమమున పెంపొందించుటకు తగుప్రయత్నముల నాచరించుట ఆర్యమిశ్రుల కందరకును సాధారణమగు సరణియేకదా ?

ఆయుర్వేదమును బెంపొందించుటకు వలయుమార్గముల గొన్నిటిని సూచించెదను.

1. ఆయుర్వేదవిద్యాశాలలను వైద్యశాలలను స్థాపించుట

2. సంస్కృతభాషాప్రచారము తగ్గియుండుటచే సంస్కృతముననున్న నాయుర్వేదీయ గ్రంథములను ఆయాదేశభాషలయందు బాగుగ పరివర్తనముచేయించి ముద్రించి దేశభాషల వైద్యవిద్యగరపుట.

3. ఆయుర్వేదమున శిథిలములగు శారీరశస్త్ర చికిత్సాతంత్రములను ఆంగ్లమతములననుసరించి లక్ష్యపురస్సరముగ నభ్యాసము చేయించుట.

4. విద్యార్థులకు వస్తుపరిజ్ఞానమును ఔషధనిర్మాణజ్ఞానమును ప్రదర్శనపూర్వకముగ కలిగించుచు విద్యనుగఱపుట.



5. ప్రసూత్యాదిసమయములయందు స్త్రీలకు కలుగు గొప్పగొప్ప కష్టములను తగ్గించుటకు దేశీయస్త్రీలకు ప్రసవశాస్త్రచికిత్సాదులను దేశభాషలయందు నేర్పుట.

6. ఆయారోగములకు సంబంధించిన విషయములను చర్చారూపమున నిర్ధారణజేసి ఆయుర్వేదప్రచార పత్రికలమూలమున దేశభాషలలో ప్రచురించుట.

7. శాస్త్రము నెఱుంగని వైద్యబ్రువులను వైద్యము చేయకుండులాగున నిర్బంధించుయత్నము లాచరించుట.

ఇట్టి యుపాయములచేతను ప్రయత్నములచేతను ఆయుర్వేదవిద్య అనుదినమును పెంపొందింపబడెనేని సకలజనులకును మిగుల నుపకారకమై దేశీయుల యుపయోగమునకు మిగుల యావశ్యకమైనదై యుండునని దృఢముగ నమ్ముచున్నాడను.

---

శ్రీమద్ధన్వంతరయేనమః.

---

అఖిల భారతవర్షీయ ఆయుర్వేద వైద్యక మహాసమ్మేళనమున

నగ్రాసనాధిపతులగు

ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి,

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులు, ఏ.వి.యస్. వారి

# ప్రారంభోపన్యాసము.

బొంబాయి, 19 ఏప్రిల్, 1913.

---

సకలకళా కోవిదులును, సమస్తవిద్యా విశారదులును, పండిత ప్రకాండులును, అఖిలవాణిజ్యధురీణులును, రాజతంత్ర నిర్వాహకులును, నిష్పాక్షిక న్యాయాధీశులును నగు మహర్షి దాదాభాయి నౌరోజి, సర్ ఫిరోజిషా మేథా., సర్ బాల చంద్రకృష్ణ, సర్ భాండార్కర్, జస్టిస్ తెలాంగ్, జస్టిస్ రానడె, ఆనరబుల్ శ్రీయుత గోఖ్లే, శ్రీయుత వాచా, డాక్టర్ దశ ముఖ్, ఆనరబుల్ పట్ని, శ్రీమంత్ ఖేమరాజ శ్రీకృష్ణ దాస్, ప్రభృతులగు దేశబాంధవులచే నధిష్ఠింపబడి భారత భూవలయమునకు నాయకమణిప్రాయమై విరాజిల్లుచుండు నీబొంబాపురమున ఆర్యవైద్య విద్యావిశారదుల పేరోలగం

బున వయసుచేతను జ్ఞానముచేతను నాకన్న పూజ్యులనేకు
లున్నను నన్నుగ్రాసనాధిపతిగ నెన్నుకొని నాకీ యపూర్వ
గౌరవమును కలుగజేసినందుకు మీకందరకును వందనశతం
బుల జేయుచున్నాను.

నేనిట్లుచేయుట కేవలము మర్యాదకొరకుగాని లోకా
చారమునుబట్టి కాదు. ఈపదవి నంగీకరింపవలయునని బొం
బాయి వైద్యక సమ్మేళన స్వాగతకారిణీ సభాసదులు సాద
రాహ్లాదముతో నన్నాహ్వానము జేసినపుడు నేనీ మహాకార్య
మునకు బూనుకొనుట సాహసకృత్యముగ నుండుననియు అర్హా
కృత్యముగ నుండదనియు మిక్కిలిసంశయించితిని. కాని ఆయు
ర్వేద వైద్యవిద్యా వైభవ ప్రచారమునం దత్యాదరముగల
ఇందరు మహనీయులకు నిర్హేతుకమైన కటాక్షము నాపై
నుప్పొంగుచుండ నేనీకార్యమున కృతకృత్యుడనగుట అసా
ధ్యముకాదను ధైర్యము నన్నిందు కంగీకరించునట్లు చేసినది.

మరియు నేనీవిషయమును విశేషముగ విచారించగ సభా
పతిగ నుండుదమా ? లేక సభకు దాసుడుగ నుండుదమా ?
యను విచారణలోగలిగి బాగుగ విచారించిచూడ సభాపతిగ
నుండుట యన సభకు దాస్యముజేయుట యగుచున్నది
కావున వైద్యవిద్యా విశారదులును కోవిదులునునగు మీకం
దరకును దాస్యముచేయు నవకాశము లభించినందుకు సంతస



మున మిగుల నానందముతో నేనీ తమ నియోగమగు సాహస
కృత్యమున కంగీకరించితిని.

కావున నేనీకృత్యమును జక్కగ నిర్వర్తించుటకు
మీయందరి యభిమాన సహాయములును నాకు మిగుల
తోడ్పాటుగ నుండగలవని రూఢిగ నమ్ముచున్నాడను

మన భారత మహీతలంబున పలువిధములగు కారణ
ములచే తొల్లింటి నాగరకతయు శాస్త్రములును కళలును క్షీణ
దశ నందియుండు నిక్కాలమున శ్రీమద్విక్టోరియా మహారాజ్ఞి
పరిపాలన కాలమునుండియు మనదేశమున నూతనశక ముద
యించినదో యనునట్టుల పలువురు విద్వత్పుంగవులు తర్క
వ్యాకరణాది శాస్త్రముల యభివృద్ధికై యొకచో విద్యాపీఠ
ములను ధర్మశాస్త్రాది పునరుద్ధరణమునకై మరియొకచోట
పరిషత్తులను వాణిజ్యశిల్పాదులయున్నతికై వేరొకదిక్కున
కలాశాలలను స్థాపించి పనిచేయుచు ఆయావిద్యలను ప్రచార
మునకు దెచ్చుచుండ వానితోబాటుగ నాయుర్వేద విద్యను
గూడ పునరుద్ధరణము చేయవలయునను సత్యసంకల్పముతో
శ్రీ శ్రీ శ్రీ దర్భాంగ మహారాజుగారగు శ్రీ శ్రీ రామేశ
చంద్ర సింహాజి బహదూర్ వారి ప్రోత్సాహవశమువలన నీస
భను స్థాపించి తన్మూలమున దేశోపకారమున ప్రవర్తించుట
మన యొక్కయు మన శాస్త్రములయొక్కయు పురోభివృద్ధికి
మంచి యవకాశము నొసంగుచుండుటచే నీమహాత్కార్యా

చరణము విషయమున మనఃపూర్తిగ మిమ్ముల నభినందించుచున్నాడను.

వైద్యశాస్త్రమున నరేబియనులకును ఆంగ్లేయులకును వారి శాస్త్రనిర్మాణమునకు మార్గదర్శకమై మూలకారణముగ దిగంత విశ్రాంత కీర్తినందిన ఆయుర్వేదవిద్య యిప్పుడు దినదినాభివృద్ధి గాంచుచుండు పాశ్చాత్యవైద్యవిద్య యెదుట తలయెత్తజాలకుండు నీకాలంబున ఆయుర్వేద సంఘములనియు ఆయుర్వేద పత్రికలనియు ఆయుర్వేద చికిత్సాలయము లనియు ఔషధాలయములనియు కలాశాలలనియు జెప్పుకొనుటకైన నవకాశము కలుగజేయుట జూడ ఈశ్వరానుగ్రహమున తిరిగి మన యాయుర్వేద విద్యకు మంచి దినము లుదయించుచున్న వని చెప్పదగియున్నది.

సార్వభౌమప్రశంస.

శ్రీమద్విక్టోరియా మహారాజ్ఞివారి కాలమున తక్కిన యార్యవిద్యలతోబాటు వైద్యవిద్యయు తిరిగిచిగురువట్టి యల్లుకొనుట కారంభించెను. పిమ్మట శ్రీమదెడ్వర్డు ప్రభుని కాలమున నయ్యది బాగుగ వ్యాపించెను. భారతీయుల భాగ్యోదయమనదగిన శ్రీజార్జిసార్వభౌముడు హస్తినాపురమున మకుటాభిషేకము నందిన కాలమున నాయుర్వేదముయొక్క నిజమహిమను తిరిగి స్థాపింప నాశాస్త్రమున ప్రవీణులగు వారలకు ప్రోత్సాహము నొసంగుచు "వైద్యరత్న" యను అపూర్వబిరుదము నిచ్చి



యీ విద్యయొక్క యుత్కృష్టతనుగురించి తమ యొప్పుదలను బహిరంగము చేయుటచే నీవిద్యయొక్క అత్యంతాభివృద్ధికి అవకాశము నొసంగిన శ్రీమేరీరాజ్ఞీ సమేతుడగు మనచక్రవర్తి యెడల మనమందరమును కృతజ్ఞులమై యుండవలయును.

సార్వభౌమ ప్రతినిధి ప్రశంస.

రాజకీయ విషయంబులయందును సాంఘిక విషయంబులయందును విద్యావిషయంబులయందును దేశాభివృద్ధికరములగు నిట్టి యితరవిషయములయందును ఎంతయు నాదరము జూపుచు మిగుల దీక్షతో పనిచేయుచు ప్రజలను తల్లివలె పాలించుచుండు భారతమండల ప్రతినిధియగు శ్రీహార్డింజి ప్రభువునకు హస్తినాపుర (ఢిల్లి) ప్రవేశ మహోత్సవ కాలమున రాక్షసప్రాయుడగు నొక దురాత్మునిచే బాంబు అను పేరుగల అయోగోళమును ప్రయోగించి కలుగజేయబడిన గాయము కరుణాసముద్రుడగు శ్రీమన్నారాయణుని యనుగ్రహాతిరేకముచే నివారింపబడుటయు స్వస్థతనందుటయు మనసార్వభౌమునకును మనకును మన దేశవాసు లందరకును పరమానందమునకు కారణముగ దలచదగియున్నది. ఇటుపిమ్మట నారోగ్యభాగ్యముతో గూడియుండు రాజేశ్వరుని ప్రతినిధియగు శ్రీహార్డింజిప్రభ్వీసమేతుడగు శ్రీ హార్డింజిప్రభువునకు పరాత్పరుడగు నా పరమేశ్వరు డెల్లప్పుడును సర్వమంగళముల నొసంగుగాక యని యాశాసించుచున్నారము.

## స్వర్గీయుల స్మరణము.

ఆయుర్వేదాభి వృద్ధికిని సంస్కృత భాషాభివృద్ధికిని ఔషధశాలలను కలాశాలలను స్థాపించి మిగుల పనిచేయుచు లోకోపకార కృత్యంబులయందు బద్ధాదరులును దేశబాంధవులునునగు ఆనరబుల్ వి. కృష్ణస్వామయ్యర్, బి.ఏ., బి.ఎల్. సి.ఎస్.ఐ గారును; ఆయుర్వేద పారదృశ్వాలును చికిత్సకచూడామణులును భారతవైద్య బృందమున దొరతనమువారిచే మొట్టమొదట "మహామహోపాధ్యాయ" బిరుదము నందుకొనినట్టియు నిఖిలభారతవర్షీయ రాజకీయ వైద్యాంగమంత్రులగు కర్నల్. లూకీసు మున్నగు పాశ్చాత్య వైద్యవిద్యావిశారదులచే మిగుల మెప్పొందినవారును అస్మదాచార్యభూతులునగు శ్రీకవిరాజ ద్వారకానాథసేన్ కవిరత్న మహాశయులును; అఖండ వైద్యవిద్యాపారీణులును విఖ్యాత చికిత్సకులును అస్మత్ప్రియసోదర ప్రాయులునునగు మహామహోపాధ్యాయ విజయరత్న కవిరంజన్ గారును; ఆయుర్వేదవిద్యాపీఠ ప్రతిష్ఠాపకులును వివిధవైద్య గ్రంథరచనా ధురీణులును అస్మత్ప్రియమిత్రులును నగు ఆయుర్వేద మహోపాధ్యాయ శంకరదాజిశాస్త్రి పదేగారును ఇట్టి యానందసమయమున మనతో సహానుభూతి నందుచు నుండక పరంధాముని పదారవింద సాన్నిధ్యము నందిరని చెప్పుటకు నోరాడకున్నది. హృదయమును భేదించుచున్నది. ఇట్టిదేశబాంధవుల మరణము



కేవలము కలకత్తా బొంబాయి మదరాసు మొదలగు నాయా ప్రాంతములకు మాత్రమే గాక మన భారతభూవలయమునకంతకును నష్టదాయకమైనది. అట్టి మహనీయుల యాశీర్వాదబలమే మనము చేయుచుండు ఆయుర్వేద సంబంధమగు ప్రతికృత్యమునకును దోడ్పడుచుండుగాక యని భగవంతుని ప్రార్థించెదను.

## ఆయుర్వేద శబ్దనిరుక్తి ప్రాశస్త్యము.

"ఆయుర్హితాహితం వ్యాధే ర్నిదానంశమనంతథా । విద్యతేయత్రవిద్వద్భి రాయుర్వేదస్స ఉచ్యతే" ఆయువును దాని హితాహితములును వ్యాధియొక్క కారణాది విజ్ఞానమును వ్యాధుల చికిత్సలును దేనియందు కలవో అయ్యది ఆయుర్వేదము నాబరగుననియు; అనేనపురుషోయస్మా దాయుర్విన్దతివేత్తిచ । తస్మాన్మునివరై రేష ఆయుర్వేదః ప్రకీర్తితః॥" దీనిచే మనుజులు దీర్ఘాయుర్లాభమును తజ్జ్ఞానమును బొందుదురు. కావున నిది యాయుర్వేద మనంబడును. అనియు చెప్పబడుచుండు ప్రమాణములచే నాయువునకు హితాహితములగు వానిని రోగజ్ఞాన చికిత్సలను దీర్ఘజీవన సాధనములను తజ్జ్ఞానమును తెలుపునది ఆయుర్వేదమని నిర్ణయింప దగియున్నది. రోగనిదాన చికిత్సాదులు సర్వచికిత్సా శాస్త్రములయందును చెప్పబడియుండినను దీర్ఘజీవన సాధనములును తజ్జ్ఞానమును

రసాయనాది ప్రక్రియలును ఆయుర్వేదమునందువలె మరియెచ్చటను చెప్పబడియుండక పోవుటచే నిందు చికిత్సాది సర్వవిషయములును త్రైకాలిక జ్ఞానసంపన్నులగు మునులు సమకూర్చి యుంచుటచే నిది వైద్యజ్ఞానవిషయమున సమస్త విషయములను తెలుపుచు కల్పతరువువలె నలరారుచున్నది.

మరియు అమృతప్రాశ చ్యవనప్రాశ అమృతభల్లాతక వసంతకుసుమాకర పూర్ణచంద్రోదయాది రాసాయని కౌషధముల ప్రభావముచే ముదుసలులుగూడ యౌవనవంతులగుచుండుట యీ యాయుర్వేదముయొక్క గౌరవమును వేనోళ్ళ చాటుచుండుటయేగాక ఏతద్భిన్న సంప్రదాయమునకు చేరిన వైద్యులకుంగూడ మిగుల నాశ్చర్యమును కలిగించుచున్నది.

ఈ యాయుర్వేద విద్యకుగల వైశాల్యమును ఆయుర్వేద శబ్దముయొక్క యవయవార్థమును విచారించి చూచితిమేని యిది కేవలము మనుజకోటికిమాత్ర ముపయోగించునదిగాక పశుపక్షి గజతురగ తరులతాదులకు సంబంధించిన వైద్యశాస్త్రమునకుగూడ నంగిమైయున్నట్లు తెలియగలదు. కావుననే గజాయుర్వేదమనియు అశ్వాయుర్వేదమనియు వృక్షాయుర్వేదమనియు నాయాభాగములకుచేరిన వైద్యశాస్త్రములన్నియు నాయుర్వేదమున కంగములుగ జెప్పబడినవి. ఆయుర్వేద విత్తములగు మనపూర్వులు తరు లతాదులను గూడ జీవరాశిలోచేర్చి వానిస్థావరప్రాణులుగ పరిగణించియున్నారు.



ఈ విషయమునుగురించి సుప్రసిద్ధరాసాయనిక శాస్త్రజ్ఞులగు డాక్టర్. జగదీశచంద్ర బోసుగారు వారి రాసాయనిక శాస్త్రవిమర్శనములచే తరులతాదులు స్థావరప్రాణికోటికి చేరినవని దృఢపరచుచు మన మహర్షు లిట్టి జ్ఞానమును చిరకాలమునకు పూర్వముననే కలిగియుండిరిగదా? యను తమపరమానందము నెరింగించియున్నారు.

భారతీయుల దురదృష్టముచే నాయుర్వేద విషయములను వివరించు ననేకములగు నుత్తమ గ్రంథములు విలుప్తములైపోయినవి. ఇప్పుడు అగ్నిపురాణము శాలిహోత్రము మొదలగు గ్రంథములవలన నాయుర్వేదాంగములయొక్క వివరణములు మాత్రము తెలియుచున్నవి. అది కారణముగ ననేకాంగముల గలిగియుండు నాయుర్వేదము మనుజకోటికి మాత్ర ముపయోగించు చికిత్సాశాస్త్రమాత్రముగ నిప్పుడు లోకప్రసిద్ధినందియున్నది. అట్టి ప్రసిద్ధిననుసరించియే నేనిప్పుడు చెప్పబోవుచున్నాను.

## ఆయుర్వేదము దాని అనాదిత్వము.

ఆయుర్వేదవిద్యావిశారద పారిషద భూయిష్ఠంబగు నీ సభాస్థలియం దాయుర్వేదమును గురించి నేచెప్పబోవు విషయములు మిగుల కొంచెముగ నుండగలవని నేను తలచెదను.

వైదిక కాలమునంగల యాయుర్వేదీయ చికిత్సలను బోధించు “ యువంచ్యవాన మశ్వినాజరంతం ” “ తస్మాఅక్షీ

నాసత్యావిచక్షు ఆథత్తం దస్రాభిషజావనర్వన్" "సద్యోజంఘాం ఆయసీంవిశ్పలాయై" "అధేనుం దస్రా స్తర్యం విషక్తా మపిన్వతం శయవే అశ్వినా గాం" అనునివి మొదలుగాగల కొన్ని వాక్యములు ఋగ్వేదమున నగుపడుచుండుటచేతను "ఋగ్వేదస్యోపవేద ఆయుర్వేదః" అని చరణవ్యూహమున శ్రీవేదవ్యాసులు ఋగ్వేదమున కుపవేదముగ జెప్పియుండుటచేతను "ఋగ్వేదోపవేదాంగం కాశ్యపంరచితంపురా" యని కాశ్యపసంహితయందు గూడ చెప్పబడియుండుటచేతను "ఇహాఖల్వాయుర్వేదోనాను యనుపాంగమథర్వవేదస్య" అని సుశ్రుతసంహితయందును "భిషజాపృష్టేనైవ చతుర్ణాంవేదానాం ఆత్మనోథర్వవేదేభక్తిరాదేశ్యా" అని చరకసంహితయందును అథర్వవేదోపవేదముగ జెప్పబడియుండుటచేతను వేదాదులవలె నాయుర్వేదముగూడ అనాదియని సిద్ధమగుచున్నది.

ఇచ్చట వ్యాసకశ్యపాదులకును చరక సుశ్రుతాదులకును దీనియుపవేదత్వము విషయమున పరస్పర భేదమగుపడుచున్నను ఋగ్వేదమున నాయుర్వేదచికిత్సలు చరిత్రాంతర్గతములుగ చెప్పబడియుండుటచే వ్యాసాదులు ఋగ్వేదోపవేదముగను పైగనుపరుపబడినట్టియు "ప్రతేభినద్మిమేహానం వర్త్రంవేశత్యాఇవ। ఏవా తేమూత్రముచ్యతాంబహిః బాలితిసరకమ్" "నక్తంజాతాస్యోషధేరామేకృష్ణేఅసిక్నిచ। ఇదంరజనిరజయకిలాసంపలితంచయత్" "సుపర్ణోజాతఃప్రథమస్తస్యత్వం



పిత్తంఆసిథ।తదాసురీయదాజితారూపంచక్రేవనస్పతిమ్" "శతావరోఅనినశత్ యక్ష్మాన్ రక్షాంసి తేజసా।ఆరోహన్ వర్చసాసహమణిందుర్నామచాతనః" అనునివియు మొదలగు నథర్వవేదవాక్యములచే అశ్మరీ మూత్రకృఛ్రి మూఢగర్భ కుష్ఠశ్విత్రయక్ష్మ అతిసార జ్వరాతిసారాదివ్యాధులకు లోహశలాకాదులచే విదారణము జెప్పియు శతావర్యాదియోగముల జెప్పియు చికిత్సలు విపులముగ బోధింపబడుచుండుటచే సుశ్రుతాదులు అథర్వవేదమున కాయుర్వేదము నంగముగను జెప్పుట దోషము కాదు. మరియు నాయుర్వేదముయొక్క ప్రాచీనతను ప్రాశస్త్యమును గురించియు పాశ్చాత్యవైద్యపుంగవుల సమ్మతిని గురించియు డాక్టర్ రాయల్, డాక్టర్ వైజ్, సర్ విలియం, హంటర్ కర్ణల్ లూకీస్, కర్ణల్ కింగ్, మహారాజాఆఫ్ గోండాల్, డాక్టర్ ప్రఫుల్లచంద్రరాయ్ మొదలగు విద్వద్వైద్యపుంగవులు తమ తమ గ్రంథములయందును చరిత్రములయందును బాగుగ నిరూపించియుండుటచేతను చరకసుశ్రుత సంహితలును మాధవ నిదానమును క్రైస్తవ అష్టమశతాబ్దమున బగదాద్ నగరమున కాలిఫ్ అను మహమ్మదీయ ప్రభువరుని పరిపాలనాకాలమునతద్దేశస్థానవిద్వాంసులచే నరబ్బీభాషయందుపరివర్తితములగుటచేతను ఈవిషయములనుగురించి విశేషముగ జెప్పుట చర్వితచర్వణమగునని యింతట విరమించుచున్నాను.

## ఆయుర్వేదవిభాగము.

శ్రుత్యాత్మకమగు నాయుర్వేదము వివిధచికిత్సల సౌకర్యమునకై ఆదియందు :—

1. శల్యతంత్రము = (Science of Surgery.)
2. శాలాక్యతంత్రము = { Science of Eye, Nose, Throat &c. Diseases.)
3. కాయచికిత్స = (General Treatment.)
4. భూతవిద్య = (Demoniacsl Diseases.)
5. కౌమారభృత్యము = (Management of Children.)
6. అగదతన్త్రము = (Texicology.)
7. రసాయనతన్త్రము = (Science of Reguvoration.)
8. వాజీకరణతన్త్రము = (Science of Aphrodisiacs.)

అని యెనిమిదివిధములుగ విభాగము చేయబడియెను.

## శల్యతంత్రము.

అందు శల్యతంత్రమున శల్యవిషయములును యంత్రశస్త్రములును తన్నిర్మాణమును విభాగములును తత్కృత్యములును తద్విధానమును చూపబడినవి. ఇందు చూపబడిన సింహముఖాదియంత్రములును ఆయంత్రనిర్మాణమువిషయమై సింహాదిముఖసామ్యమునకు చెప్పబడినయుక్తియు అర్శోరోగాదులయందు యంత్రముల నుపయోగించుపద్ధతులును శస్త్రకర్మలును తద్విధానమును దానియందలి నైపుణ్యమును అధునాతనాంగ్లేయ శస్త్రచికిత్సకులకుగూడ నాశ్చర్యకరములని చెప్పిన నతిశయోక్తి కాజాలదు.



## శాలాక్యతంత్రము.

శాలాక్యతంత్రమున కంఠమునకు పైనుండు కన్ను, చెవులు, ముక్కు, దంతములు, నాలుక, పెదవులు, గొంతు, శిరస్సు మొదలగు నవయవములకు గలుగు వ్యాధులను వాని నిదానాదులను నిపుణతమమగు శస్త్రచికిత్సలను సామాన్యచికిత్సలను ప్రత్యేకముగను విపులముగను నిరూపింపంబడినవి. మరియు నీతన్త్రమునం జెప్పంబడిన నేత్రరోగమందలి లింగనాశమునకై జేయు శస్త్రచికిత్సలును, గళరోగమందలి రోహిణీవ్యాధికై నియమితములగు శస్త్రచికిత్సలనుం బరికించిజూడ నేటికాలమున ప్రసిద్ధిగాంచిన పాశ్చాత్య శస్త్రచికిత్సలకు వెనుదీయకయున్నవని జెప్పుట కెవరికి యానందము గలుగజాలదు. వెండియు నీతన్త్రముననిరూపించిన శిరోవస్తివిధములు ఇచ్చుట నాగరకవైద్యవిద్యా వేత్తలకుగూడ నాశ్చర్యమును గలిగించుచున్నయవి. ఇట్లు ప్రత్యేకచికిత్సావిభాగము చికిత్సాతన్త్రములు ప్రకృతకాలమునకు విరళప్రచారములై ఆయుర్వేదముననిట్లు ప్రత్యేకచికిత్సకతన్త్రములుగలవా యనునటుల సందేహమునకు కారణమును గలిగించుచున్నయది.

## కాయచికిత్స.

కాయచికిత్స యనగా యన్త్రశస్త్రాదుల యక్కరలేక ఔషధములచేతనే రోగనివారణమును చేయువిధానము. ఈ

తన్త్రమున సామత్వ నిరామత్వ భేదముచే రోగములనెఱింగి ఔషధముల నుపయోగించు ప్రకారములు నిరూపింపబడినవి. "జ్వరస్య పూర్వరూపే లఘ్వశనమపతర్పణం వా" "జ్వరితం షడహేఽతీతే లఘ్వన్నం ప్రతిభోజయేత్" ఇత్యాదులచే చరకమున జ్వరితునకు ఆరుదినములు లంఘనమును తరువాత లఘ్వశనమును (చులకనగ జీర్ణమగు గంజిమొదలగు నాహారము) చెప్పబడినవి. శోఫరోగమున దానికి హేతువులగు జలపాన లవణభక్షణాదులను నిషేధించి క్షీరపానాదు లుపదేశింపబడినవి. అర్శోరోగ గ్రహణి వాత కఫజ్వరాదులయందు మజ్జిగ నుపయోగించుటకంటె నుత్తమచికిత్స లేదని చరకాచార్యులు చెప్పియున్నారు.

ఇంగ్లండు జర్మనీమొదలగు పాశ్చాత్యదేశములయందు తక్రనిర్మాణమును దాని గుణములును ఇప్పుడిప్పుడే తెలిసికొనబడుచున్నవి. వమనవిరేచన ధూమపానాది శోధన చికిత్సలును అతిక్రూరములగు పక్షవధాదివ్యాధులయందు వస్తిప్రయోగములును తద్విశేషములును ఆయుర్వేదమునగాక యింకనెచ్చటను ఇంతబాగుగ వివరింపబడియుండలేదు. ఇప్పటివారి వస్తివిధానము వేడినీళ్ళతో మాత్రమే నిర్వర్తింపబడుచున్నది. ఇట్లు కాయచికిత్సయందలి పూర్వులనేర్పును తెలుపు విషయము లసంఖ్యాకములుగనున్నవి. అవియన్నియు వైద్యపుంగవు లెఱింగినవియేకావున నింతటితో విరమించుచున్నాను.



కాయచికిత్సకు సంబంధించిన అద్భుతవిషయము లనేకములు పూర్వులచే చాలకాలమునకు ముందుగనే తెలుపబడియున్నవి అయినను ఆవిషయములు పాశ్చాత్యులు ఇప్పుడిప్పుడు కనుగొనుచున్నారని అనేకులు తలచుచున్నారు.

## భూతవిద్య.

అపస్మారము ఉన్మాదము భూతోన్మాదము మొదలగు మానసిక రోగములును వానిచికిత్సలును ఈతన్త్రమునకు చేరినవి. ఈతన్త్రమునకుచేరిన గ్రన్థము లీకాలమున నంతగ గానరావు. ఇట్టి మానసికరోగములకు పఞ్చగవ్యప్రయోగమువంటిది మరియొకటి కనుబడదు. మాంసి, బ్రాహ్మి, మాతులుఙ్గము మొదలగు నోషధులు నీ విషయమున మంచిఫలము నిచ్చునవిగ నున్నవి. వీని సంబన్ధమగు సామాన్యజ్ఞానములచేగూడ ప్రతివారును మానసికరోగములను నివర్తింప జేయుచుండుట మిగుల నాశ్చర్యకరమైన విషయము.

## కౌమారభృత్యము.

ఈ భాగమున ముఖ్యముగ వివరింపబడు విషయములు సన్తానోత్పత్తివిషయమై తలిదండ్రుల వర్తనమును గర్భధారణము మొదలు ప్రసవమువరకు తల్లియొక్క వర్తనమును ఉత్పన్నమగు శిశువుయొక్క రక్షణమును మున్నుగాగల విషయములు మిగులనేర్పుతో చూపబడినవి. సుశ్రుత శారీ

రమునను గదాసఞ్జీవన్యాది గ్రన్థములయందును ప్రసవించు వరకు గర్భిణికి కలుగు వ్యాధులకుగాను నిరూపింపబడిన "మాసానుమాసికము" లను చికిత్సలు పరమాహ్లాదము నొసంగును. సుశ్రుతచికిత్స 15 - వ అధ్యాయమున మూఢగర్భ చికిత్సనుగురించి చెప్పబడిన "ఉత్కర్షణాకర్షణ స్థాపనాపవర్తనోత్కర్తన భేదనచ్ఛేదన పీడన ఋజూకరణ దారణాని" అను వచనమును విమర్శించి చూచితిమేని ప్రసూతిచికిత్స కౌమార భృత్యముల నార్యులకుగల యమేయ కౌశల్యము తనంతనే తెలియగలదు.

## అగదతన్త్రము.

స్థావరములును జఙ్గమములును కృత్రిమములును నగు విషములవలనగలుగు వ్యాధులనెరుంగుటయు వానిచికిత్సలును అగదతన్త్రమున బాగుగచూపబడినవి. సర్పాదులచే దష్టములయిన భాగములయందు పైపై మూడుచోటుల నరిష్టబన్ధనము చేయుటయు ఆచూషణము (అనగా దుష్టరక్తమును పీల్చుట) ను ఛేదనము (విషముగల ప్రదేశమును కోయుట) ను విస్రావణము (విషరక్తమును స్రవింపజేయుట) ను దాహము (విషముగల ప్రదేశమును కాల్చుట) ను సిరావ్యధయు (విషమయమగు నరముల వేధించుట) ననునవి మొదలుగాగల విషవ్యాప్తిని నిరోధించుటకు హేతుభూతము



లగు నుపాయములు బాగుగ బోధింపబడినవి. హృదయ రక్షణము మొదలగు వ్యాపారములును బాగుగ జెప్పబడినవి. చరకసంహితయందు గన్ధహస్తి మహాగన్ధహస్తి మున్నగు నౌషధములు చెప్పబడినవి. ఈ తన్త్రమునకు చేరిన విషయములు విధి విచారపూర్వకముగ ప్రచారమున లేకపోయినను పామరులచేగూడ సర్పదష్టులు బాగుగ చికిత్సల నందుచున్నారనుట సర్వజనవిదితము. ఆన్ధ్రదేశమున గోదావరీతీరమున రాజమహేన్ద్రినగరపురాజగు వీరభద్రారెడ్డి పత్నియగు అనితల్లియను నొక సాధ్వీమతల్లి తమయాస్థానపు పండితుడును సర్వవైద్యశిఖామణియు భరద్వాజగోత్రోత్పన్నుడును నగు నొక బ్రాహ్మణునకు 1345 (వెయ్యిన్ని మున్నూట నలుబదియైదవ) శాలివాహనశక వత్సరమున కలువచేరు గ్రామమును దానమిచ్చినటుల తామ్రశాసనమువలన దెలియుచున్నది. ఇట్టి శాసనములను సంపాదించి ప్రయత్నపూర్వకముగ బరీక్షించినచో వైద్యసంబన్ధములగు పురాతనవిషయములు తెలియగలవు.

## రసాయనతన్త్రము.

ఇది యీ శాస్త్రమునకంతయు ప్రధానమైనభాగము. ఈ భాగమునకు వ్యాధులనడచి ముదిమినిబోగొట్టి రోగములు కలుగకుండ శరీరమును కాపాడుట ముఖ్యమగు ప్రయోజనము. శాస్త్రమునననుసరించి వాతాతపిక (ఇచ్ఛాపథ్యము)

కుటీప్రవేశిక (కఠినపథ్యము) రసాయన సేవనముల జేసినవా రనేకులు అనన్తఫలము ననుభవించువారు మనచే గనబడుచున్నారు. చరకాచార్యులచే నీతన్త్రపుమహిమ విపులముగ వర్ణింపబడియె రసాయన పాదమున నగుపరుచపడిన యనేక రసాయనయోగములును రసతన్త్రముల జూపబడిన పూర్ణచన్ద్రోదయము వసన్తకుసుమాకరము త్రైలోక్యచిన్తామణి మున్నగునవియు మిగుల ప్రసిద్ధములైనవి. ఇట్టియోగము లితర సంప్రదాయములయం దేవైద్యగ్రన్థములయందును ప్రతిపాదింపబడియుండలేదు. జరామరణనివారణమునకు యోగశాస్త్రమట్లు ఈతన్త్రమును పూర్వులచే నభివృద్ధినందింపబడెను. సిద్ధజీవనతన్త్రము మున్నగునవి యనేకములగుగ్రన్థము లీవిషయమున వ్రాయబడెను.

## వాజీకరణతన్త్రము.

వాజీకరణతన్త్రమున అల్పదుష్టక్షీణరేతస్కులయొక్క దురవస్థలను దూరముగజేసి సన్తానకారణమైన శుక్రమును బాగుపరచి వృద్ధినందించు ననేకములగు మోదకాది వృష్యయోగములు చెప్పబడినవి. ఆత్మగుప్తము ఇక్షురము గోక్షురము అశ్వగన్ధము ముసలి శతావరి మొదలగు మూలికావిశేషములును బస్తాణ్డచటకాణ్డాదులును శుక్రము నభివృద్ధినందించునవిగ చిరకాలమునకుపూర్వమే మహర్షులెరిగి యుపయోగించు



చుండినటుల తెలియుచున్నది. ఇప్పటి వైద్యశాస్త్రములయం దీవిషయములు లేనేలేవు. అని వైద్యు లిట్టివిషయములగని మిగుల నాశ్చర్యమునందెదరు.

## ఆయుర్వేద పరంపర.

ఇట్లష్టాఙ్గవిశిష్టమగు నీయాయుర్వేదమును చతుర్ముఖుడు దక్షప్రజాపతికిని దక్షుడాశ్వినేయులకును అశ్వినీదేవత లిన్ద్రునకును సహస్రాక్షు డత్రిపుత్రులకును అత్రిపుత్రులు అగ్నివేశ భేడజాతుకర్ణపరాశర ధన్వన్తరిప్రభృతులకును పరంపరగ నుపదేశించియుండునట్లు తెలియుచున్నది ఈపరంపర మరికొన్నిగ్రన్థములయందు వేరువిధముగ నగపడుచున్నది. ఈ యార్షపరంపరకు చేరిన గ్రన్థములలో కాశ్యప భేడ చరక సుశ్రుత సంహితలును అశ్వాయుర్వేద గజాయుర్వేదములును మాత్ర మిప్పుడు లభ్యములుగనున్నవి.

## కాశ్యపసంహిత.

అందు కాశ్యపసంహితయందలి రచనాపద్ధతి మిగుల ప్రాచీనమైనది. చికిత్సాపద్ధతులు భేడచరక సుశ్రుతసంహితలయందువలె లేకపోయినను వానికంటె క్లిప్తముగను కాయచికిత్సాప్రధానముగను నిర్మితమైన ట్లగుపడుచున్నది. ఇందు జపహోమ బిల్వ తులస్యర్చనాభిషేకాదులతోగూడ ఔషధయోగములు సంక్షేపముగ జెప్పబడినవి ఇది భేడాదులకు

మునుపటిదని యూహింప దగియున్నది. దీని సంపూర్ణప్రతి యలభ్యముగ నున్నది.

## భేడసంహిత.

ఈగ్రన్థపుప్రతియందు మొదటిసూత్రస్థానమున చాల భాగములు శిథిలములైయున్నవి. మిగిలిన స్థానములయందు గూడ నచ్చటచ్చట శిథిలభాగము లగుపడుచున్నవి. ఇట్టి ప్రతి యొకటి తంజావూరునగరమున రాజకీయసరస్వతీపుస్తకభాణ్డాగారముననున్నది ఈమాతృక ననుసరించియే నేనొకప్రతిని వ్రాయించియున్నాను నాప్రతిని మరియొకప్రతితో సరిచూడవలయునని చిరకాలముగ బ్రయత్నింపుచుంటిని కాని యింతవరకు నొక్కటైనను వేరుప్రతి నాకు లభింపలేదు. ఆలోచింపగా భేడసంహితయొక్కప్రతి యిది యొక్కటియే ప్రపంచమున మిగిలియున్నట్లగుపడుచున్నది. ఈగ్రన్థమును స్థానవిభాగమునుబట్టియు పరికించిచూచితిమేని యిది చరకసంహితయొక్క క్రమము నెంతయు బోలియున్నట్లు తెలియవచ్చును.

## చరకసంహిత.

ఆత్రేయసంప్రదాయానుసారియగు చరకుడు కాయచికిత్సయందెంతయు సమర్థుడు. కాయచికిత్సాపద్ధతుల నింతటి నేర్పుతో వివరించినవారు మరియొకరులేరని దృఢముగా జెప్పవచ్చును. ఈయన కాయచికిత్సను ప్రధానముగ గ్రహించి



యుండుటచే శల్యశాలాక్యతన్త్రములనుగురించి విస్తరించిచెప్పక పోయినను సన్నిరుద్ధగుద జలోదరాదిచికిత్సల జెప్పునపుడు శస్త్రచికిత్సావిధానములను నిరూపించెను. శారీరకాగంతుకవ్రణభేద పరిజ్ఞానము తన్నిదానము సాధ్యాసాధ్యనిరూపణము చికిత్స మొదలగువానిని జెప్పునపుడు "పాటనం వ్యధనం చైవ లేఖనం భేదనం తథా। ప్రచ్ఛనం సీవనం చైవ షడ్విధం శస్త్రకర్మ తత్" అని శస్త్రకర్మ నారువిధములుగ నగుపరచెను. మరియు "పరాధికారేణ న విస్తరోక్తిః" అని చికిత్సాస్థానమున నేత్రరోగప్రకరణమున జెప్పియుండుటచే వీరికాలమున శల్యతన్త్రమును శాలాక్యతన్త్రమును ప్రత్యగ్జవివరణముతో నెక్కువవ్యాప్తి నందియుండినట్లగుపడుచున్నది. కాని వానికిసంబంధించిన విశేషగ్రన్థములేవియు నిప్పుడు గానరావు. మరియు "బాహ్లీకాః పల్లవాః చీనాః చూలికాః యవనాః శకాః। మాంసగోధూమమాధ్వీకశస్త్రవైశ్వానరోచితాః॥ క్షీరసాత్మ్యాః తథా ప్రాచ్యాః మత్స్యసాత్మ్యాశ్చసైన్ధవాః। అశ్మకావన్తికానాం తు తైలాజ్యం సాత్మ్యముచ్యతే॥ కన్దమూలఫలం సాత్మ్యం విన్ధ్యాన్మలయవాసినామ్। సాత్మ్యం దక్షిణతః పేయా మన్థశ్చోత్తరపశ్చిమే॥ మధ్యదేశే భవేత్సాత్మ్యం యవగోధూమగోరసాః। తేషాం తత్సాత్మ్యయుక్తాని భైషజ్యాన్యవచారయేత్॥" అనియిట్లు నానాదేశవాసులకు హితమును సాత్మ్యమునునగు పథ్యములను ఔషధములను నిర్ణయించి చెప్పుటచూడ నీయాచార్యునకుగల

చికిత్సానిపుణతయు సర్వదేశవ్యాపిచికిత్సావిజ్ఞానమును విశదము లగుచున్నవి.

## సుశ్రుతసంహిత.

ఈకాలమునకు మిగిలియుండు శల్యతన్త్రగ్రన్థములలో సుశ్రుతమే యగ్రగణ్యమైనది. ఈయన చరకాచార్యుడు చెప్పిన షడ్విధశస్త్రకర్మలను పెంచి యష్టవిధములుగ నిరూపించి యున్నాడు. యన్త్రములు స్వస్తిక సందంశ తాళ నాడీ శలాకోపయన్త్రభేదముచే భిన్నములై నూటయొక్కటిగ నుండుననియు అవి లోహదన్తదార్వాదులచే యథోక్తరూప పరిమాణంబులుగను అందముగను నునుపుగను పట్టుకొనుటకు వీలుగను మంచి చీలలు మొదలగువానితో గూడినవిగను మంచిపనివారలచే చేయబడినవిగను నుండవలెననియు నిర్ణయించెను. శస్త్రములును మణ్డలాగ్ర కరపత్ర వేతస వృద్ధిపత్రాదిభేదములు కలిగినవిగను మంచిలోహముచే ప్రసిద్ధులగు కమ్మరులచే నుచితప్రమాణరూపాకారాదులు కలుగునట్లు నిర్మితములుగను వెంట్రుకలనుగూడ నిలువుగ చీల్చునంతటి సూక్ష్మమైనవాడి కలిగినవిగను నల్లగలువలవలె తళతళమెరయునవిగను నుండవలయునని నిర్ణయింపబడెను. మరియు విద్యార్థులు శస్త్రవిధానములను సామ్యవస్తువులయందుచేసి యభ్యసింపవలసినపద్ధతులును శస్త్రములను పట్టుకొనురీతియు శస్త్రములను ప్రదేశభేదములయందుపయోగించు విధానములును వ్రణబన్ధనమున నుపయోగింపబడు ద్రవ్యములును చతుర్దశవిధములగు బన్ధనములును శస్త్రచికిత్సాజ్ఞానమునకు పూర్వముజ్ఞాతవ్యమగు శారీరపరిజ్ఞానమును విపులముగ నిరూపింపబడెను. మూఢగర్భము అశ్మరి ఉదరము విద్రధిమొదలగు వ్యాధులయందు జూపిన శస్త్రచికిత్సానైపుణ్యము అత్యద్భుతము.



మరియు నేత్రవ్యాధులను డెబ్బదియారుగ నిరూపించెను. అందు "ఛేద్యాస్తేషు దశైకం చ నవ లేఖ్యాః ప్రకీర్తితాః । భేద్యాః పఞ్చ వికారాస్స్యుర్వ్యధ్యాః పఞ్చదశైవ తు । ద్వాదశాశ్శస్త్రకృత్యాశ్చ యాప్యాస్సప్త భవన్తి హి। రోగా వర్జయితవ్యాశ్చ దశ పఞ్చ చ జానతా॥" అను శ్లోకములచే నీవ్యాధులలో కొన్ని ఛేద్యభేద్యాది శస్త్రకృత్యములచే సాధ్యములని తెలియుచున్నది.

లేఖ్యకర్మకర్హములగు వ్యాధులయందు మొదట నేత్రమునకు స్వేదనాదుల జేసి "తతః ప్రమృజ్య ప్లోతేన వర్త్మ శస్త్రపదాఙ్కితమ్ । లిఖేచ్ఛస్త్రేణ" (రెప్పను చక్కగ ప్లోతము (వత్తుడుగుడ్డ) చే తుడిచి శస్త్రముచేగూడిన గురుతున లేఖన శస్త్రకర్మను జేయవలెను) అను నీక్రమముచే శస్త్రముపయోగింపబడినది.

అర్మమనువ్యాధియందు మొదటచేయదగు కృత్యముల జేసి "అపాఙ్గం ప్రేక్షమాణస్య బడిశేన సమాహితః। ముచ్ఛ్రాయ

గృహ్య మేధావీ సూచీసూత్రేణ వా పునః।.....ఉల్లిఖేత్ మణ్డలాగ్రేణ తీక్ష్ణేన పరిశోధయేత్।విముక్తం సర్వతశ్చాపి కృష్ణాచ్ఛుక్లాచ్చ మణ్డలాత్।నీత్వా కనీనికోపాన్తం ఛిన్ద్యాన్నాతికనీనకమ్॥" అని భేద్యచికిత్స విపులముగ చెప్పబడినది. మరియు దృష్ట్యాశ్రితమైన శ్లైష్మిక లిఙ్గనాశకరోగమున "యన్త్రితస్యోపవిష్టస్య స్వాం నాసాం పశ్యతస్సమమ్ । మతిమాన్ శుక్లభాగౌ ద్వౌ కృష్ణాన్ముక్త్వా హ్యపాఙ్గతః । ఉన్మీల్య నయనే సమ్యక్ సిరాజాలవివర్జితే । నాధోనోర్ధ్వం చ పార్శ్వాభ్యాం ఛిద్రేదైవకృతే తతః॥ శలాకయా ప్రయత్నేన విశ్వస్తం యవవక్త్రయా। మధ్యప్రదేశిన్యఙ్గుష్ఠ స్థిరహస్తగృహీతయా । దక్షిణేన భిషక్ సవ్యం విధ్యేత్సవ్యేనచేతరత్ । వారిబిన్ద్వాగమస్సమ్యక్ భవేచ్ఛబ్దస్తథా వ్యధే।సంసిచ్య విద్ధమాత్రన్తు యోషిత్ స్తన్యేన కోవిదః.....। శలాకాగ్రేణ తు తయా నిర్లిఖేద్దృష్టిమణ్డలమ్ । .....నిరభ్రి ఇవ ఘర్మాంశుర్యదాదృష్టిః ప్రకాశతే।తదా సౌ లిఖితా సమ్యక్ జ్ఞేయా యాచాపి నిర్వ్యథా । తతో దృష్టేషు రూపేషు శలాకామాహరేచ్ఛనైః॥" అని యిట్లు లిఙ్గనాశక వ్యాధియందు శస్త్రకర్మ నాచరించు వైద్యుడెట్లుండవలయును రోగినెట్లుంచవలయును శస్త్రము నెట్లు పట్టుకొనవలయును ఎట్లు కర్మనాచరించవలయును అను నీవిషయములు మిగుల నేర్పున చెప్పబడియున్నవి. మిగుల సూక్ష్మావయవమగు నేత్రమునందలి దృష్టిని ఆశ్రయించియుండు వ్యాధులను గురించి చెప్పబడిన యీశస్త్ర



విధానములను పరికించిచూచిన అప్పటివారి శస్త్రచికిత్సా విజ్ఞాన మన్యాదృశమని తప్పక చెప్పవచ్చును.

మరియు నీతన్త్రమునకు చేరిన నేత్రచికిత్సలకొరకు శస్త్రప్రయోగ మక్కరలేకయే త్రిఫలాతైల త్రిఫలాఘృతాదులు కొన్ని చెప్పబడియున్నవి. అట్టి ప్రక్రియ లిప్పటివారి కెవ్వరికిని తెలిసియుండవనుట నిక్కము.

## అష్టాఙ్గహృదయము.

చరక సుశ్రుతుల కనంతరమున సిన్ధుదేశ వాసియగు వాగ్భటుడు ఆత్రేయాదిమతముల ననుసరించి "అష్టాఙ్గసంగ్రహము" "అష్టాఙ్గహృదయము" అను విపులములగు రెండు గ్రన్థములను విరచించెను. ఈగ్రన్థములయందు చరక సుశ్రుతుల యందుకంటె జక్కనికట్టుబాట్లతో విభాగముచేసి ప్రత్యేకాధ్యాయములయందు విషయము సుబోధముగ నిరూపింపబడినది. శల్యతన్త్రమున సుప్రసిద్ధిగాంచిన ఔపధేనవసుశ్రుతాదులు శస్త్రకృత్యముల నెనిమిదింటినిమాత్రము నిరూపించియుండ ఈయన పండ్రెండువిధములుగ నిరూపించుటయు వారు శస్త్రములను ఇరువదివిధములని చెప్పియుండ ఈయన మరియారింటి నెక్కువగ జెప్పుటయుజూడ వారికాలమునకంటె వాగ్భటునికాలమున ఆయుర్వేదీయ శల్యతన్త్రము సంస్కారణమునంది యభివృద్ధికి వచ్చినట్లగుపడుచున్నది. శాలాక్యత

న్త్రాన్తర్గతములగు నేత్రశ్రోత్రాదిచికిత్సలనుగూడ నీయన చాల నిపుణముగ నిరూపించియున్నాడు. రసతన్త్రమునకుచేరిన గ్రన్థములలో సుప్రసిద్ధమగు "రసరత్నసముచ్చయము"ను గూడ నీయనయే రచించెనని చెప్పుదురు.

## రుగ్వినిశ్చయాదిగ్రన్థములు.

ఆయుర్వేదీయ గ్రన్థకర్తలలో వృద్ధత్రయి యనబడు చరక సుశ్రుత వాగ్భటుల కనన్తరమున ననేకులు గ్రన్థములను వ్రాసియున్నారు. అందు నిదానరాజమనంబరగు రుగ్వినిశ్చయమనుగ్రన్థ మనేకమహర్షుల వ్రాతలనుండి సంగ్రహించి మాధవకరునిచే కూర్చబడెను. మాధవనిదానము ననుసరించి బృన్దమాధవులచే సిద్ధయోగమను చికిత్సాగ్రన్థము వ్రాయబడెను. బృన్దమాధవునిచే చెప్పబడని యోగముల దెల్పుదునని ప్రతినజేయుచు చక్రపాణిదత్తులు చక్రదత్త చికిత్సాసారమను గ్రన్థమును రచించిరి. భావమిశ్రులనువారిచే మిగుల విమర్శనాపూర్వకముగ ఖణ్డాన్తరాగతములును నవీనములునునగు పరంగాది రోగములకు నిదానచికిత్సలను గూడ చేర్చి భావప్రకాశికయను గ్రన్థరాజము రచింపబడెను. ప్రమాణవర్ణాకృతినామజాతులను ఓషధితత్వజ్ఞాన సాధనములనేర్పరచి ద్రవ్యావళియనియు ధన్వన్తరినిఘంటువనియు సుప్రసిద్ధమగు వైద్యకనిఘంటువు నొకదానిని నిర్మించిరి. వైద్యశాస్త్రమున



నిట్టి నిఘంటుగ్రన్థ మింకొకటి కానరాదు. రసార్ణవము రసరత్నాకరము మొదలగు పెక్కులు తాన్త్రికసంప్రదాయమునకుచేరిన గ్రన్థములు రచింపబడినవి. మరియు ఆయుర్వేద సూత్రములు కల్యాణకారకము ఆనన్దకన్దము పరహితసంహిత వీరభట్టీయము భేషజకల్పము భోజనకుతూహలము జీవరక్షామృతము కార్మణము శివతత్వరత్నాకరము బసవరాజీయము చిన్తామణి వఙ్గసేన మదనపాల రాజనిఘంటువులు శార్ఙ్గధరసంహిత అనునీగ్రన్థములును రచింపబడినవి. అరుణదత్తుడు హేమాద్రి శ్రీకణ్ఠదత్తుడు విజయరక్షితుడు డల్వణుడు బ్రహ్మదేవుడు గయదాసుడు చక్రపాణి మొదలగువారిచే చరక సుశ్రుత వాగ్భటాది గ్రన్థములకు విపులములగు వ్యాఖ్యానములు వ్రాయబడెను. ఈ నవీనకాలమున ఆచార్యగఙ్గాధర కవిరాజవర్యునిచే చరక సుశ్రుతములకు వ్యాఖ్యానములు వ్రాయబడి ఆయుర్వేద ముద్ధరింపబడెను. మరియు వైద్యరత్న జోగీన్ద్రనాథసేన్, యం. పి. కవిరాజ గణనాథసేన్ యం. పి. యల్.యమ్.యస్. మొదలగు నామిత్రులు నవీనముగ గ్రన్థములనువ్రాసిఆయుర్వేదమునువృద్ధికిదెచ్చుచున్నారు. ఆర్యులారా? ఆయుర్వేదీయ సారస్వతమున గ్రన్థచక్ర మిట్లు ప్రవర్తించెను.

## ఓషధిశాస్త్ర పరిజ్ఞానము.

ఆయుర్వేదమున నుపయోగింపబడు పదార్థములు ప్రాణిజములు (జీవజంతువులు) ఖనిజములు (లోహములు మొదల

గునవి) ఉద్భిజ్జములు (మూలికలు) నని మూడువిధములుగా నుండును. ఈమూడువిధములగు పదార్థములను విమర్శనాపూర్వకముగ బరీక్షించి అందలి గుణాదివిశేషముల నెరింగి తత్తద్రోగవినాశకములుగ పూర్వులు వినియోగించియున్నారు. అందు ఉద్భిజ్జములు ఓషధులు వీరుత్తులు వనస్పతులు గుల్మములునని నాలుగు విధములుగ గ్రహింపబడినవి. వైదిక కాలమున రోగనాశకములుగ నీనాలుగువిధములగు నుద్భిజ్జపదార్థములుమాత్రమే గ్రహింపబడినట్లు తెలియుచున్నది. ఈ నాలుగువిధములగు వస్తువులయొక్కయు నిస్సంశయమగు పరిజ్ఞానమునకై ప్రమాణ వర్ణ ఆకృతి నామ జాతులనియెడు నైదుపాయముల నెరుగవలయును. ఈయైదువిధములగు నుపాయములచేతనే వస్తుతత్వనిర్ణయమును చేయుటకై ధన్వన్తరిమొదలగు నిఘంటువుల రచించినవారు శుణ్ఠ్యాదిసర్వపదార్థములకును పర్యాయములను గుణములను నిరూపించియున్నారు. అందు పర్యాయపదములవలన బాహ్యేన్ద్రియ జన్యవస్తుజ్ఞానము కలుగును. గుణకథనముచే నన్తరిన్ద్రియోపయోగపూర్వకముగ రసవీర్యవిపాకప్రభావగుణములనెడు పదార్థశక్తుల దెలియనగును. దానంజేసి రోగనాశకఫల మేర్పడును. ఆర్యులు ఇట్టి విధానములచేతనే పదార్థవిజ్ఞానమును పదార్థగత రసవీర్యవిపాకాది శక్తిజన్యరోగనాశకతా జ్ఞానమును సంపాదించియుండిరని తెలియదగియున్నది. శాస్త్రములయందు



"మూర్వా" యనుశబ్ద ముపయోగింపబడుచున్నది. ఈ శబ్దముచే వాచ్యమగు పదార్థమును దేశభేదముచే గొందరు కన్దప్రధానమగు వస్తువనియు మరికొందరు లతాప్రధానమనియు వేరొకరు గుల్మమనియు మరియొకరు ఓషధియనియుచెప్పెదరు. అట్టిసమయములయందు శాస్త్రసాధనము లేక పదార్థమునునిశ్చయించుటయెట్లు? ఇట్టి సమయములయందే పర్యాయములును గుణములును సాధనములగును. ఎట్టులన?—ఇట్టి పదార్థజ్ఞానమున కుపయోగింపబడు పర్యాయములు సామాన్యములనియు విశేషములనియు రెండువిధములు. త్వక్పత్ర ఫలమూలములను తెలుపునవి సర్వసామాన్యములగుటచే సామాన్యపర్యాయములు. వస్తుభేదమును తెలియజేయు కృష్ణత్వస్నిగ్ధత్వాదులు తత్తత్పదార్థములకు విశేషించి భిన్నములగుటచే విశేషపర్యాయములు. ఇట్టి సామాన్యవిశేష పర్యాయములచే విభజించుకొని ప్రమాణ వర్ణాకృతి నామజాతులచేతను రస వీర్య విపాక ప్రభావ గుణములచేతను వస్తునిర్ణయము తెలియవలసియుండును. ఎట్లన? మఞ్జిష్ఠయను వస్తువునుగురించి "మఞ్జిష్ఠా" యను పర్యాయపదమునకుగల "మఞ్జుని మనోజ్ఞే వర్ణే తిష్ఠతి" యను వ్యుత్పత్తిచే మనోహరమగు వర్ణముకలిగినది యని తెలియవచ్చును. " యోజనవల్లీ " " చిత్రలతా " యను పర్యాయములచే చాలదూరము వ్యాపించు చిత్రమగు తీగయని తెలియవచ్చును. మరియు " చిత్రాంగి " యనుపర్యాయము చిత్రము

లగు నవయవములు కలిగినదనియు "రక్తాంగి" "రక్తయష్టి" యను పర్యాయము లెఱ్ఱనికాడలు కలిగినదనియు "మండూకపర్ణి" యను పర్యాయము మండూకపర్ణివంటి యాకులు కలిగినదనియు బోధించుచున్నవి. "వస్త్రభూషణా" యను పర్యాయముచే బట్టలకు మంచిరంగును కలిగించునది యని బోధితమగుచున్నది. ఇట్లు కొన్ని పర్యాయములచే మంజిష్ఠ యెఱ్ఱని చిత్రములగు కాడలుకలిగి మండూకపర్ణివంటి యాకులతో చాలదూరమువరకు వ్యాపించు మనోహరమగు తీగయనియు నిది బట్టలకు రంగువేయుట కుపయోగించు ననియు ప్రమాణ వర్ణాకృతినానా జాతులుచే బాహ్యస్వరూపము తెలియుచున్నది. ఇంక "స్వాదు" "కషాయ" విశేషణములచే మధురరసము ప్రధానముగ నుండుననియు కషాయము ఉపరసముగ నుండుననియు తెలియదగియున్నది. "ఉష్ణా" యనునది ఉష్ణవీర్యము కలిగియుండుటను చెప్పుచున్నది. ఇట్లే "గురుః" అను విశేషణము గురుగుణమును "కఫోత్థ వ్రణమేహాస్రవిష నేత్రామయాన్ జయేత్" అనునది ప్రభావమును వివరించుచున్నది. ఇట్లీగుణవర్ణనము రసవీర్యాదులను తెలుపును. ఇట్లు ఆర్యులు ప్రతివస్తువునందును బాహ్యేంద్రియజన్య స్వరూపనిర్ణయమును అన్తరింద్రియజన్య రసవీర్య విపాకాది శక్తినిర్ణయమును చేయుచుండిరనుట స్పష్టమగుచున్నది. విషయవిమర్శనాపూర్వకమగు నార్యుల విజ్ఞానమునకు ధన్వన్త



ర్యాది నిఘంటువులును సుశ్రుతమందలి సోమలతాది వర్ణనములును మన్థానభైరవకృతమగు ఆనన్దకన్దమునందలి చతుష్షష్టి మహౌషధి వర్ణనములును అగ్నిపురాణాన్తర్గతమగు వృక్షాయుర్వేద విషయములును ప్రబలనిదర్శనములుగనున్నవి. ఇట్టిస్థితిలో మనపూర్వులు ఓషధులు మొదలగువాని విషయమున విమర్శనాపూర్వకమగు జ్ఞానమును కలిగియుండలేదనియు నిచ్చవచ్చినట్లెల్ల జెప్పియుండిరనియు గొందరుచెప్పు విషయములు గ్రాహ్యములు కావనుట నిశ్చయము.

### ఖనిజవస్తు పరిజ్ఞానము.

మహారసములు సాధారణరసములు లోహములు రత్నములునని ఖనిజములు నాలుగువిధములు. ఇవి దొరకు ప్రదేశములను వానిభేదములను స్వరూపవర్ణనములను వానిభేదములను శోధన భస్మ సత్వపాతన ద్రవీకరణములనునాలుగు విధములగు వీనిపరిణామములను నిరూపించిరి. "అష్టాశ్రశ్చాష్టఫలకః షట్కోణో మసృణో గురుః। శుద్ధమిశ్రితవర్ణైశ్చ యుక్తో వైక్రాన్త ఉచ్యతే" అనియు, "శ్వేతోరక్తశ్చ పీతశ్చ నీలః పారావతచ్ఛవిః। శ్యామలః కృష్ణవర్ణశ్చ కర్బురశ్చాష్టధా హి సః॥" అనియు వైక్రాన్తస్వరూపమును దాని భేదములును తెలియుచున్నవి. అనన్తరము శోధనమారణ సత్వపాతనద్రవీకరణోపాయములు కనుపట్టును. "తత్రాద్యం మాక్షికం కాన్యకుబ్జోత్థం స్వర్ణసన్నిభమ్। తపతీతీరసంభూతం పఞ్చవర్ణ

సువర్ణవత్ । పాషాణబహుళః ప్రోక్తస్తారాఖ్యోఽల్పగుణాత్మకః॥ " అనియు, " వఙ్గవద్ద్రవతేవహ్నౌ చపలస్తేన కీర్తితః " అనియు చెప్పబడిన విషయములను చూచిన పూర్వులు ఖనిజములను వాని స్వరూపములను భేదములను చక్కగ గుర్తెరిగి యౌషధములయందు వినియోగించుచుండినట్లు తెలియుచున్నది.

## ప్రాణిజములు.

స్వేదజ అండజ ఉద్భిజ్జ జరాయుజ భేదముచే ప్రాణిజములు నాలుగువిధములు. ఈ నాలుగువిధములగు ప్రాణిజములను మహామృగములు మృగములు విష్కిరములు ప్రతుదములు ప్రసహములు బిలేశయములు అప్చరములు జలజములు నను భేదముచే నిరూపించి వాని మాంసము రక్తము అండములు మొదలగువాని గుణములను రసవీర్యవిపాకాదులచే గనుంగొని వానిమూలమున రోగములం బారదోలుచుండిరి.

ఈ రీతిని ఖనిజ ఉద్భిజ్జ ప్రాణిజ భేదముగల పదార్థములు వానిభేదములు మొదలగువానిని చక్కగ దెలిసికొని చికిత్సాశాస్త్రమున నగ్రగణ్యతనుపొందిన మహర్షుల జ్ఞానాతిశయము కొనియాడదగియున్నది.

## తాన్త్రికపరిజ్ఞానము.

భేడ చరక సుశ్రుతాది సంహితలయందు ఖనిజపదార్థముల యుపయోగము విశేషించి కానరాదు. అయినను చరక



చికిత్సాస్థానమునందలి రసాయనపాదమున స్వర్ణరజత ముక్తా ప్రవాళముల యుపయోగములును ప్రమేహమున శిలాజతు ప్రయోగమును శ్వాసరోగమున ధూమపాన ప్రకరణమున మనశ్శిలయొక్క వినియోగమును కుష్ఠరోగమున రసభస్మ గంధక తాళకముల వినియోగమును చూపబడినవి. సుశ్రుత నేత్ర చికిత్సయందు ముత్యముల యొక్కయు అఞ్జనముల యొక్కయు వినియోగముమాత్రము కొంచె మగపడుచున్నది.

కాశ్యప భేడ చరక సుశ్రుతములయందు విహితమై యుండు చికిత్సాప్రణాళి వైదికకాలము మొదలుగ పరంపరగ ప్రాప్తమైయుండుటచే వైదికచికిత్సయనియు రసగన్ధకాభ్రకాదికమగు ఖనిజపదార్థములచేచేయబడు చికిత్సావిధానము నాగార్జునాదులచే తాన్త్రిక యుగమున నధికముగ గనుగొనబడియుండుటచే తాన్త్రికచికిత్సయనియు రసవైద్యమనియు నాయుర్వేదవేత్తలు వ్యవహరింతురు.

నాగార్జునుడు నిత్యనాథుడు కాపాలి వ్యాళి రావణుడు గోముఖుడు లఙ్కేశుడు సురానందుడు నాగబోధి గోవిందుడు లంపటుడు మున్నుగాగలిగిన ఇరువదియేడుగురు సిద్ధులును మన్థానభైరవ స్వచ్ఛన్దభైరవ ఆనన్దభైరవాదులగు భైరవులును రసశాస్త్రమునకు ప్రవర్తకులు రసాదిధాతువులను జారణము మారణము సత్వపాతము ద్రవీకరణ మను నుపాయము

లచే పరిణామమునందించి వానిప్రయోగముచే శారీరకములగు రోగముల నిర్మూలనమును చేయుచునుండిరి.

"ఆయతనం విద్యానాంమూలం ధర్మార్థకామ మోక్షాణామ్ । శ్రేయఃపరం కిమన్యత్ శరీరమజరామరం విహాయైకమ్॥" అను రసరత్నసముచ్చయము ప్రథమాధ్యాయమున నుండు శ్లోకమున రసమునకు రోగనివారణము మాత్రమేగాక ధర్మార్థకామ మోక్షముల సిద్ధిగూడ ఫలముగ జెప్పబడియుండుటచే చిరకాలమునకు పూర్వమే ఆర్యమహర్షులచే రసశాస్త్రములు సమకూర్పబడినవని తెలియుచున్నది. ఆశాస్త్రములే యిప్పటి ధాతువాద (కెమిస్ట్రీ)విద్యకు మూలమని తెలుపబడుచున్నది.

మరియు జారితలోహాదులు అల్పపరిమాణముగల మోతాదులుగ నుపయోగించుటచేతనే అమోఘమగు గుణమును కలిగించుచున్నవి. అరోచకాది దోషంబుల కవకాశమునీయవు.

### అగస్త్యసంప్రదాయము.

ద్రవిడదేశమున "అగస్త్యసంప్రదాయ" మను పేరున వ్యవహరింపబడు చికిత్సలుకలవు. ఈచికిత్సలు ఆర్యతాన్త్రికముల మిశ్రణములుగ పొడకట్టుచున్నవి.

### అగస్త్యవైద్య పరంపర.

ఆర్యతాన్త్రిక సంప్రదాయమునందువలె నీయగస్త్య సంప్రదాయమునకు చేరిన తన్త్రమునందును ఈశ్వరుడు



పార్వతికిని పార్వతి నన్దికేశ్వరునకును నన్దీశు డశ్వినీదేవతలకును వారలు విశ్వేదేవులకును వారు ధన్వన్తరికిని ధన్వన్తరి యగస్త్యునకును అగస్త్యుడు పులస్త్యునకును పులస్త్యుడు తేరయ్యరునకును తేరయ్యరు యూగమునికిని ఈతన్త్రము నుపదేశించిరను మొదలగు పరంపర యగుపడుచున్నది.

ఈ పరంపరయు గ్రన్థభేదముచే భిన్నభిన్నముగ గన్పట్టుచున్నది. ఈ సంప్రదాయమునకు అష్టాదశ మహాసిద్ధులు ప్రవర్తకులనియు వారును తాన్త్రికరససంప్రదాయమునగూడ ప్రసిద్ధులైయుండు అగస్త్య నన్దికేశ ధన్వన్తరి ప్రభృతులుకాక తక్కిన చట్టముని పుళుణ్డార్ కరువూరార్ తేరయ్యార్ తిరుమూలర్ భోగర్ కొంకణర్ ఎడక్కాట్టార్ మొదలగు సంస్కృతము నెరుగని కేవల ద్రవిడులనియు తెలియుచున్నది.

ఆ సంప్రదాయమునకు ప్రవర్తకులు నలుబదియెనమండుగురని కొందరును ఇరువదియొక్కరని కొందరును చెప్పెదరు. ఇట్లీవిషయమున భిన్నభిన్నములగు నభిప్రాయములున్నను పైజెప్పబడిన పదునెనిమిది సిద్ధులకు ప్రాధాన్యమును చెప్పుట సర్వసమ్మతమైనది.

ఈ సిద్ధులలో గొందరు ఆర్షసంప్రదాయము ననుసరించి గ్రన్థములను రచించియుండుటచే వడసాంప్రదాయికు (ఉత్తరసాంప్రదాయికు) లనియు కొందరు కేవల దక్షిణసంప్రదాయ

మననుసరించి గ్రన్థములను రచించియుండుటచే తేర్. సాంప్రదాయ (దక్షిణసాంప్రదాయి) కు లనియు నీదేశస్థులు వ్యవహరింతురు.

ఈ రెండువిధములగు వ్యవహారములవలననే ఆర్షతాన్త్రిక సంప్రదాయములకంటె భిన్నమగు మఱియొక సంప్రదాయము కలదనియు నది దక్షిణసంప్రదాయమను పేరున వ్యవహరింపబడుచున్నదనియు ఇదియే ఆదేశముననుండు "అగస్త్యసంప్రదాయ" మనియు నూహింపబడుచున్నది.

అగస్త్యసంప్రదాయ ప్రాచీనత.

శ్రీ శ్రీరామచంద్రుడు దక్షిణాపథమునకు వచ్చుటకు పూర్వమే అగస్త్యమహర్షి యిచ్చటకు వచ్చియుండెననుట యెల్లరెఱింగినదియే. అప్పు డచ్చటనుండిన వైద్యకవిషయము లెట్లుండెననుట తెలియదు. అగస్త్యమహర్షి ఆర్షవైద్యనిపుణు డనుట స్పష్టమే.

ఆయుర్వేద తన్త్రములయందు నిపుణుడగు నగస్త్యమహర్షి యిచ్చటకువచ్చి దాక్షిణాత్యులకు వైద్యనైపుణ్యవిశేషముల నుపదేశించుటనో వారి వైద్యవిద్యను సంస్కరించుటనో మరియే కారణముననో ఈసంప్రదాయమునకు అగస్త్యసంప్రదాయమను ప్రసిద్ధికలిగెనని తలంచెదను.



ఈ సంప్రదాయమునకు చేరినవారలును గ్రన్థములనేకముల విరచించిరి. వారిలో తేరయ్యారు విరచించినవి పరమ ప్రాచీనములని తెలియుచున్నది.

కొందరు సిద్ధులు ఆయుర్వేద సంప్రదాయమునకుచేరిన గ్రన్థములను ద్రవిడభాషకు పరివర్తనముచేసి వానియందు తైలములు లేహ్యములు కషాయములు మొదలగు నౌషధ యోగములను నిరూపించిరి.

తాన్త్రిక సంప్రదాయ గ్రన్థములు తరుచుగ ద్రవిడ సంప్రదాయము ననుసరించినవియే.

రసార్ణవ సోమనాథసిద్ధాదుల పారిభాషిక పదములు ద్రవిడగ్రన్థములయం దగుపడవు.

భస్మసిన్దూర ద్రవాదికములగు ఖనిజపదార్థముల పరిణామ విశేషములయొక్క ప్రక్రియాభాగములును రసశాస్త్ర సంప్రదాయమునకంటె భిన్నములైనవివలె కనుబడుచున్నవి.

వీరి సంప్రదాయము ననుసరించి లోహాదుల భస్మవిధానము అతి సుకరమైనది. అందు కొన్నిటిని పారిపదులగు తమకు దెలుపుచున్నాడను.

జయసీరు.

కొన్ని క్షారలవణముల సముదాయమును పాతాళయన్త్రసహాయముచే భూమియందు కొన్నిదినములుంచిన నయ్యది ద్రవరూపముగ పరిణమించును. ఆద్రవమును ఈసంప్రదాయ

మున "జయసీరు" అని వాడెదరు. ఇట్టి అనేకవిధములగు జయస్సీరుల సహాయమున గౌరిపాషాణ శిఙ్గపాషాణాదులకు చురుకు (అగ్నిసేకము) అను నుపాయముచే బద్ధము (అగ్నిసహనముగ జేయుట) అను సంస్కారమును చేయుదురు. అట్లు బద్ధములగు పాషాణాదులను తేనెమొదలగు పాయ్యవస్తువులతోడ అల్పమాత్రకముగ సన్నిపాతాదులయం దుపయోగించెదరు.

### ముప్పు.

మరియు కొన్నిఉప్పుల సంయోగముచే చేయబడు "ముప్పు" అని వ్యవహరింపబడు ఒకవిధమగు స్నిగ్ధవస్తువును వాడెదరు. ఈ ముప్పుయొక్క సంయోగమున ఖనిజములగు గన్ధకాదులను భస్మముచేయుదురు. ఆభస్మము అగ్నిసహనముగ నుండితీరును. దానిని మిక్కిలి యల్పమాత్రముగ వాడెదరు. ఇటులనే పాషాణాదులను లోహాదులను భస్మము చేసెదరు.

### అభ్రికము.

ఆయుర్వేద సంప్రదాయానుసారముగ ననేకపుటముల వేసినగాని నిశ్చన్ద్రికముకాని కృష్ణాభ్రికమును ద్రవిడసంప్రదాయానుసారముగ నాయిపొగలై అని అరవమునను, కుక్కపొగాకు అని తెనుగునను వాడబడుదాని రసముతో ధాన్యాభ్రికమును నూరి పది పదునైదు పుటములువేసిన నిశ్చన్ద్రిక



మగును. ఇయ్యది రసతన్త్రిసంప్రదాయపు అభ్రికభస్మమున కన్న గుణాధికమని నాయభిప్రాయము.



### గురుభస్మము.

మైలతుత్తమును కొన్నిమూలికలసహాయమున విద్యాధర యన్త్రిమున నొకవిధముగ పక్వము జేయుదురు. అయ్యది శరచ్చన్ద్రిచన్ద్రినివతె శుభ్రిమై భస్మముగపరిణమించును. దీనినే "గురుభస్మ" యందురు. ఇయ్యది వారి సంప్రదాయమున సిద్ధౌషధమని పిలువబడును. ఒకటి రెండు మోతాదులకన్న నధికముగ దీని నుపయోగింపరు. ఇది చేయుగుణము లచింత్యములు.

ఇట్టి వనేకవిధముల ప్రయోగరాజము లీసంప్రదాయమునకు చేరినవికలవు. ఈప్రయోగములయందును ప్రక్రియలయందును యన్త్రిసంయోజనాదులయందును గూడ నీయుభయమతములకును చాలభేదమున్నట్లు తెలియుచున్నది.

ఈ ద్రావిడ సంప్రదాయపు చికిత్సాప్రక్రియలు దక్షిణదేశమునను సింహళద్వీపమునను సింగపూరు బర్మా టిబెట్టులయందును ఇప్పటికిని వాడుకయందున్నవి. ఈ వ్యాపకము ప్రాయశః బౌద్ధులకాలమున జరిగినట్లు లూహించెదను. క్రమక్రమమున నార్యులు సింధునదినుండి లంకాద్వీపమువరకును వ్యాపించి యెల్లవిద్యలను వృద్ధిజేసియుండియు నీసంప్రదాయ

ప్రక్రియలను తమ గ్రన్థములయందేల చేర్చుకొనలేదో తెలియదాయె.

ఈసంప్రదాయమునకు చేరిన అగస్త్యుడు ఆయుర్వేదసూత్రములకు భాష్యమును రచించెనని తెలియుచున్నది.

### అగస్త్యర్ ఆయుర్వేదము.

ఇది పన్రెండువందల పరిమాణము గలిగిన గ్రన్థము. ఇందు వస్తుగుణరసవీర్య విపాకాదిపదములను ప్రయోగింపకయే ఆయారోగముల నివారించుట కుపాయములగు సంస్కృత నిఘంటువులలో చెప్పబడని యనేకవస్తువులు వర్ణింపబడినవి.

మరియు ఆరువందల గ్రన్థముగల "అగస్త్యర్ వైద్య" మనుసదియు నాలుగువందలపరిమితిగల "అగస్త్యర్ పరిపూర్ణ" మును పదునైదువందల పరిమితిగల "అగస్త్యర్ వైద్యకావ్య" మును మూడునూరుల పరిమితిగల "అగస్త్యర్ చెన్దూరము"ను ఇట్టి వింక ననేకగ్రన్థములును ద్రవిడసంప్రదాయము ననుసరించి వ్రాయబడినవి. మరియు నీయగస్త్యర్ అను నాయన ఆర్షసంప్రదాయమునకు చేరిన గ్రన్థములనుకూడ రచించెనని వినుచున్నారము. ఇంకను "పులిప్పాణి" అనువారు అయిదునూరుల పరిమితిగల గ్రన్థమును "భోగర్" ఏడువేలగ్రన్థమును "యూగముని" వేయిగ్రన్థమును "రోమఋషి" అయిదునూరులగ్రన్థమును ఇట్లు ద్రవిడసంప్రదాయజ్ఞు లనేకగ్రన్థములను రచించిరి.



ఆయుర్వేదసూత్రములకు వ్యాఖ్యను రచించిన యోగానన్దనాథులుకూడ ద్రవిడసంప్రదాయమునకు చేరిన సిద్ధులలోనే చేరినవారని తెలియుచున్నది. ఇంక నిట్టి వనేకములగు గ్రన్థము లచ్చటచ్చట అఱగియుండినవి. ఇప్పుడు క్రమక్రమముగ ప్రచురమునకు వచ్చుచున్నవి.

అగస్త్యసంప్రదాయమునకు చేరిన వైద్యకతన్త్రములను ప్రవర్తింపజేసిన వారిలోని అగస్త్యాదులను ఆర్షవైద్యమునకు ప్రవర్తకులుగ పరిగణించియుండుటచేతను. వారివారి చరిత్రములు లేకుండుటచేతను కొన్నియున్నను అయ్యవి అసంపూర్ణములుగ వ్రాయబడియుండుటచేతను ఇందలి పూర్వోత్తరములను నిశ్చయించుట కష్టముగనున్నది.

మరియు నీసంప్రదాయమునకుచేరిన పరస్పర ప్రక్రియాభాగభేదములంగూర్చి చర్చింతమన్న సత్సంప్రదాయమునకు చేరిన గ్రన్థములు విరళప్రచారము లగుటచేతను ప్రకృతమున ప్రచారమునందుండు గ్రన్థములును కేవలసాంకేతికపదములతోడను ఉపమాద్యలంకారములతోడను కూడిన ప్రాచీనద్రవిడభాషయందు వ్రాయబడియుండుటచేతను అట్టి గ్రన్థములయందలి విషయములనుగురించి పౌర్వాపర్య విరోధరహితముగను సంప్రదాయసిద్ధముగను తెలియగల జ్ఞానముకలవా రరుదగుటచేతను అది దుర్ఘటముగనున్నది. ఇట్టితరుణమున ప్రకృతము తెలిసినంతవరకు నాసంప్రదాయమునకుచేరిన గ్రన్థములను

విమర్శించుచుండు తదనుయాయులగు చికిత్సకులవలన . తెలియ బడిన విషయములను పట్టిచూడ ఆర్యతాన్త్రికమత వైద్యముల కంటె అగస్త్యసంప్రదాయము భిన్నమనియే తోచుచున్నది.

మఱియు నార్యతాన్త్రిక రసగ్రన్థములలో నుదహరింప బడు నేపారిభాషికపదముగాని యగస్త్యసంప్రదాయమున గన బడకుండుటచేతను అగస్త్యసంప్రదాయగ్రన్థములకుచేరిన పారి భాషికపదములు తాన్త్రికరసగ్రన్థములయం దుదహరింపబడక పోవుటచేతను ఈ రెండుతన్త్రములును వేర్వేరనియే తోచెడిని.

ద్రావిడభాష చిరకాలమునుండియు మంచియభివృద్ధిలో నున్నదనియు నీయభివృద్ధికై కొన్నిసఙ్ఘములు కూడియుండిన వనియు ఆభాషయందు వేదాన్తాదిశాస్త్రములయందు గొప్ప గ్రన్థములుకలవనియు దక్షిణదేశభాషలగు నాన్ధ్రకర్ణాటకాదు లకు ఇది మాతృభాషయనియు ఇది సంస్కృతభాషాసహా యము నేమియుకోరని స్వతన్త్రభాషయనియు కొందరు చరిత్ర కారులు వ్రాయుచున్నారు.

ఇట్టికారణములచే నిది స్వతన్త్రతన్త్రమని తోచినను ఈ సంప్రదాయమున ఆర్షసంప్రదాయమందువలెనె సిద్ధాన్తి తములగు రుగ్వినిశ్చయోపాయములును, శారీరకశాస్త్రవిభాగ ములును, సిద్ధాన్తచికిత్సానిరూపణములును, శుంఠి మొదలగు పదార్థముల గుణాదినిర్ణయములును ప్రకృతము లభ్యములగు



గ్రన్థముల గానరాకుండుటచేతను దొరికిన గ్రన్థములు కేవ లము రసతన్త్రప్రక్రియలుమాత్రము బోధించుటచేతను ఇంకను అందలి విశాలగ్రన్థములను కూలంకషముగ విమర్శించువరకును ఎట్టిసిద్ధాన్తమును చేయుటకు వీలుకాకున్నది.

## దక్షిణదేశమున వైద్యాభివృద్ధి.

దక్షిణదేశమున ఆర్షతాన్త్రిక వైద్యమును మిక్కిలి యభివృద్ధికి దెచ్చినవారు జైనులును ఆదేశపు శైవులును అయి యున్నారు. ఈ దక్షిణదేశమున ప్రబలిన వైద్యగ్రన్థములు కొన్ని విమర్శించిచూడ విశేషముగ భేడకాశ్యపసంప్రదాయ ములను అనుసరించినవిగను మఱికొన్ని గ్రన్థములు అష్టాఙ్గ హృదయమును రసరత్నాకరాది గ్రన్థములను అనుసరించినవి గను గన్పట్టుచున్నవి. అనేక వ్యాఖ్యానములు మహర్షిమత సామాన్యమును అనుసరించినవిగ కనుబడుచున్నవి. సూత్ర రూపములగు గ్రన్థములను బసవరాజీయాది గ్రన్థకర్తలు విని యోగించి యుండుటచేతను ఆయుర్వేదసూత్ర బుగ్ఘృదయ సారాది సూత్రగ్రన్థములు ప్రత్యేకముగ నుండుటచేతను ఈ ప్రాంతముల నీ సూత్రగ్రన్థరచన అధికమని తోచుచున్నది.

## ఆయుర్వేద సూత్రములు.

ఇవి పదునేడు ప్రశ్నములలో గలవు. గ్రన్థమసంపూ ర్ణము. ఈ సూత్రములకు మొదటినుండి ఐదుప్రశ్నములవరకు

యోగానన్దననాథులు రచించిన వ్యాఖ్య లభ్యమైయున్నది. సంపూర్ణమగు వ్యాఖ్య మైసూరునగరమున గలదని వాడుకయున్నది. ఇదిగాక దీనికి అగస్త్యమహర్షి భాష్యమును రచించె ననియు దెలిసెడిని. "ఆమంహి సర్వరోగాణామ్" "అనామపాలనంకుర్యాత్" "సిరామార్గగతపవనయోగాత్" "తత్తత్కమలామృత మాహారక్సిఙ్చతి" అని యిట్లు సూత్రములప్రక్రియ యగుపడుచున్నది. ఇందలివిషయములను విమర్శించినచో యోగశాస్త్రముల కాలమున నీ సూత్ర గ్రన్థములు ప్రబలినట్లగుపడుచున్నది. దీని వ్యాఖ్యానమును చూచిన కేవల వాగ్భటవాక్యము లుదాహరణరూపమున నీయబడి యుండుటచే వాగ్భటముకన్న నవీనమని స్పష్టముగ దోచుచున్నది. "ఋగ్ఘృదయసార" "ఋగ్విలాస" "ఋగ్ఘృదయము" లను సూత్రగ్రన్థములు కేవలము లుప్తప్రాయములు. అచ్చటచ్చట కొన్నిసూత్రములుమాత్ర మచ్చునకు కనబడుచున్నవి.

### శివతత్త్వరత్నాకరము.

ఇయ్యది గొప్పరసగ్రన్థము. ఇందు "సర్వేశ్వరఃపూర్ణచన్ద్రోదయో రాజమృగాఙ్కః । స్యాన్మాలినీ వసన్తాఖ్యో వసన్తకుసుమాకరః । త్రైలోక్యచిన్తామణి స్స్యాన్మహాభూపతిరేవ చ । లక్ష్మీవిలాసమిత్యుక్తా అష్టావేతే మహారసాః॥" అని యీ యెనిమిదింటికిని అష్టమహారసములని సంజ్ఞచేసియున్నాడు. "బృహతీకుసుమాకారం లఘువారితరం గురు। ఘర్షణే



కృష్ణవర్ణం స్యాత్తన్మృగాఙ్కస్య లక్షణమ్॥" "అతసీపుష్పసఙ్కాశః భూపతిర్లఘుమానకః" "వల్మీకశిఖరాకారం భఙ్గే నీలోత్పలద్యుతి। ఘర్షణే రక్తవర్ణం స్యాత్సిన్దూరంతత్ప్రదృశ్యతే" అని యిటుల అష్టవిధమహారసములకును సిద్ధముచేసిన సిదప ఘర్షణ తోలన ఛేదన దర్శనాదులచే వాని స్వరూపలక్షణాదుల నిరూపించియున్నాడు. ఇది యితర రసగ్రన్థములయందు కానరాకున్నది. కావున నీగ్రన్థకర్తకు రసతన్త్రపరిజ్ఞానమును అందలి శోధనములును అధికములని తోచెడిని.

### కల్యాణకారకము.

ఇయ్యది శ్రీజైనమతాచార్యులగు జినునిచే మగధభాషయందు మున్ముందు వ్రాయబడిన గ్రన్థము. ఇది వారి శిష్యుడగు ఉగ్రాదిత్యునిచే సంస్కృతమున వ్రాయబడెను. ఇది గద్యరూపముగను పద్యరూపముగను నుండును. అందు గద్యగ్రన్థమున "ఖ్యాతశ్శ్రీనృపతుఙ్గవల్లభ మహారాజాధిరాజాస్థితః ప్రోద్యద్భూరి సభాన్తరే బహువిధప్రఖ్యాతవిద్వజ్జనే। మాంసాశిప్రకరేన్ద్రితాఖిల భిషగ్విద్యావిదామగ్రతః మాంసేనిష్ఫలతాం నిరూప్య నితరాం జైనేన్ద్రవైద్యః స్థితః॥" అను శ్లోకమున జెప్పబడినట్లు ఈతడు పశుపతి గౌతమ హస్తచారి కుమ్భదన్త ప్రభృతులగు ముప్పది తొమ్మండ్రు విద్వద్వైద్యుల గ్రన్థముల యాధారమున 814 వ క్రైస్తవశతాబ్దమున (814 A. D.) నుండిన రాష్ట్రకూట వంశమునకుచేరిన నృపోత్తుఙ్గమహారాజు

సభయందు అనేక విద్వద్వైద్యుల యెదుట మాంసాశనము కూడదని సిద్ధాన్తము జేసిన మహానుభావుడు. ఈయుగ్రాదిత్యుడు తనశ్లోకరూప కల్యాణకారకమున కనబరచిన చికిత్సాప్రణాళియు గద్యాత్మకమున గనపరచిన ప్రణాళినే పోలియున్నది. వీరు ఉదాహరణముగ తీసికొనిన గ్రన్థకర్తల గ్రన్థములుకాని వారినామములుగాని యీకొలది కాలముననే కానరాకున్నవి.

కార్మణము.

ఇది పదార్థములను వివరముగబోధించు గ్రన్థములలో నగ్రగణ్యమైనది. దీనియందు త్వక్ పుష్ప ఫలపత్ర బీజమూల భేదముచేప్రతివస్తువునకును ప్రత్యేకప్రత్యేకముగ గుణములు తెలియజేయబడినవి. దీనియానుపూర్వియు రచనాపద్ధతియుజూడ నిదియాన్ధ్రదేశమందలి యొక విద్వద్వైద్యునిచే రచింపబడినట్లు తోచుచున్నది. ప్రకృతపు దీనిప్రతియందుగల అశుద్ధము లిన్నియని జెప్పజాలను. శుద్ధప్రతికై చిరకాలముగ ప్రయత్నము చేసినను కానరాకున్నది. విషయమును కనుటకెంత సంతోషము కలుగునో యంతటిదుఃఖము దానియందలి తప్పులను కనునపుడు కలుగును.

ద్రవ్యగుణములను బోధించు గ్రన్థములలో నభిధాన రత్నమాల ద్రవ్యరత్నావళి యోగరత్నావళి ద్రవ్యగుణ కల్పవల్లిమొదలగునవి పదింటికంటె హెచ్చుగ గ్రన్థములు లభ్యములుగనున్నవి.



ఆర్షతాన్త్రిక గ్రన్థములు.

ఆర్షతాన్త్రికములను నుభయవిధ వైద్యములను బోధించునవియు స్కన్ధత్రయోపేతములును నగు బసవరాజీయము చిన్తామణి చికిత్సాసారము కాశ్యపమతము శాస్త్రదర్పణము యోగార్ణవము మున్నగు గొప్పగ్రన్థములు గలవు. వానిలో చిన్తామణియందు జ్వరభేదములును వాని చికిత్సావిధానములును సర్వోత్కృష్టములుగ నిరూపింపబడినవి.

నాడీగ్రన్థములు.

పదికి తక్కువ కాకుండ నాడీగ్రన్థములు కలవు. వానిలో షడ్విధనాడీతన్త్రముత్తమమైనది.

వ్యాఖ్యావిశేషములు.

సుప్రసిద్ధమగు నష్టాఙ్గహృదయమునకు అరుణదత్త హేమాద్రులచేవలె విజ్ఞానేశ్వర ఉదయాదిత్యభట్ట గఙ్గాధరసూను మాధవాచార్యులచే గూర్పబడిన వ్యాఖ్యలుకలవు. అవియు నతిగమ్భీరములు.

అష్టాఙ్గహృదయ ఖణ్డనమును మణ్డనమును.

సౌరవిద్యాధరుడు రచించిన అష్టాఙ్గహృదయ ఖణ్డనము సయుక్తికమైనది. దీనిపై వితలపణ్డితుడు రచించిన మణ్డనమును మిగుల యుక్తియుక్తముగనున్నది. ఈరెండును అతి ప్రాచీనములు.

## భేషజకల్పము.

భేషజకల్పమను గ్రన్థము పరిభాషలను బాగుగ బోధించును. దీని కనేకవ్యాఖ్యానములును కలవు.

భోజనకుతూహలము చారుచర్యయను పేరులుగల రెండు గ్రన్థములు లారోగ్యబోధకములైనవి రాజిల్లుచున్నవి.

## పరహితసంహిత.

పరహితసంహిత యెనిమిది కాండములతో కూడి శ్రీనాథపండితునిచే రచింపబడినదై యున్నది. ఈగ్రన్థమున కౌమారభృత్యమును మొదలుగ జేసికొని శల్యతన్త్రము శాలాక్యతన్త్రము కాయచికిత్స భూతవిద్య అగదతన్త్రము వాజీకరణతన్త్రము రసాయనతన్త్రము అను నీభాగములు వేరువేరుగ మిగుల విపులముగ నిరూపింపబడినవి. నిరూపింపబడిన విషయములన్నిటిలో కౌమారభృత్య మతివిపులమైనది. ఇప్పటి విభాగగ్రన్థములలో నిది యుత్తమగ్రన్థమని తలంచెదను.

## జీవరక్షామృతము.

జీవరక్షామృతమను గ్రన్థము శ్రీకణ్ఠపణ్డితునిచే రచింపబడినది. ఇది మాధవనిదానమువలె నిదానమును బోధించు గ్రన్థము. అందునను మొదటిదగు జ్వరనిదాన మతివిపులమై యున్నది. అశ్మరి మొదలగు సమస్తరోగములయందును మాధవనిదానమునకంటె దీనియందు అతిబహుళముగ లక్షణములు వర్ణింపబడినవి.



ఈగ్రన్థము చాలకాలమునకు ముందుగనే ఆన్ధ్రద్రవిడ భాషలయందు పరివర్తనము చేయబడియెను. ఈగ్రన్థమునందు ద్రవిడదేశస్థుల కొకవిధమగు నిరుపమప్రేమకలదు. ఈగ్రన్థమును నిదానములలో మిగుల నుత్తమమైనది.

పూర్వము దక్షిణదేశము కేవలము శైవప్రధానముగ నుండినదగుటచే నిచ్చట రసతన్త్రకములగు రసప్రదీపిక రసభేషజకల్పము మున్నగు రసతాన్త్రిక గ్రన్థములును ఆర్షతాన్త్రిక వైద్యజ్ఞానముచే మిశ్రగ్రన్థములును అనేకములు విరచింపబడినవి.

మరియు నీదక్షిణదేశమున భేదమతము ననుసరించి వ్రాయబడిన గ్రన్థములును సూత్రగ్రన్థములు ననేకములుకలవు. వానిలో రసతన్త్రగ్రన్థ నిర్మాణముత్తరదేశమునకంటె నిచ్చట నధికముగ నుండునని నాయభిప్రాయము.

## కేరళీయులు, ఆర్ష చికిత్స.

కేరళదేశమున జననమందిన ప్రతివారలును సంస్కృతభాష నభిమానముతో జదువనారంభింతురు. సంస్కృతమున గొంతభాషాజ్ఞానము కలిగినంతనే అష్టాఙ్గహృదయమునుకాని జ్యోతిషగ్రన్థములనుకాని చదువుట వాడుకయై యున్నది. అష్టాఙ్గహృదయము నారంభించినవారలు దానిని కూలంకషముగ జదివి వెనువెంటనే చికిత్సను నేర్చుకొందురు.

కేరళములయందు జ్ఞానము కలిగిన వైద్యుడనిన ఆతనికి అష్టాఙ్గహృదయమంతయు కణ్ఠస్థముగ నుండునని చెప్పవచ్చును. ఆదేశమున బాలురకు అష్టాఙ్గహృదయమును సన్ధ్యావన్దనము కన్న నెక్కుడుశ్రద్ధగ బోధింతురు.

అచ్చటివైద్యులలో మందులదినుసుల నమ్మువారు కొందరు కలరు. వారు ప్రాయికముగ సిద్ధములగు నౌషధముల నమ్మువారివలె శుష్కార్ద్రరూపములగు ఓషధిసామాన్యములను దశమూల పఞ్చకోల పఞ్చభద్రాది సఙ్కేతసిద్ధసముదాయౌషధి ద్రవ్యములను ఆదేశమున నెక్కుడుగ వాడుకలో నుండు క్షీరబలాదియోగముల కుపయోగించు ద్రవ్యములను సిద్ధముజేసి విక్రయించుటకై యుంచెదరు.

వైద్యుడు రోగికి రుగ్వినిశ్చయముజేసి దశమూలాదులలో నెకకషాయము నెకసప్తకమువరకు బుచ్చుకొమ్మని పరిమాణాదులతో చెప్పిపంపును. రోగి అంగడికరిగి యింతటి పరిమితిగల దశమూలముల నిమ్మనియడిగినంతనే యచ్చట నిరాటంకముగ నిత్తురు. ఈసంప్రదాయము ననుసరించి ప్రతి పల్లెయందును ఇట్టిమూలికలనమ్ము అంగడులుకలవు. ఆదేశమున వైద్యులు ఓషధులన్నిటియొక్కయు దశమూలాదులకు చేరిన వానియొక్కయు పేర్లను కొంతవికారమునందిన సంస్కృత భాషాపదములతోడనే తరుచుగ వ్యవహరింతురు. మరియు నీదేశమున అష్టాఙ్గహృదయ ప్రక్రియననుసరించి వైద్యము



జేయు నొకతెగ బ్రాహ్మణజాతికిచేరిన అష్టవైద్యులనబడు కొన్నికుటుంబములు కలవు. వీరిపూర్వులు ఆదేశపురాజాస్థానమున అష్టాఙ్గవైద్యమున నొక్కొకయఙ్గమున దిగ్దన్తులబోలె జ్ఞానాతిశయముచే మెప్పొందియుండిరి. ఆపరంపరకు చేరినవారలిప్పటికిని ఆయాభాగవిశేషములయందే కొంతవరకైనను జ్ఞానమును కలిగియున్నారని వాడుక.

శోధనచికిత్సలలో జేరిన స్నేహస్వేదశిరోవస్త్యాదులు వీరి సొమ్మైయున్నవి. ఈశోధనచికిత్సలలో నీదేశస్థులకు గలజ్ఞానము ప్రాయికముగ భరతఖణ్డమం దెవరికినిలేదని చెప్పవచ్చును. మరియు వీరు ధారాకల్పప్రయోగమునం దతినిపుణులు. విధి విహితమగురీతిని నిరూహ అనువాసనవస్తికర్మల జేయువారు కొందరు కలరని తెలియుచున్నది.

అష్టాఙ్గహృదయచికిత్సయనిన వీరికి మిగులప్రేమ. ఆర్ష చికిత్స యథాశాస్త్రమగు ప్రక్రియలతో నీప్రాన్తముల నింకను మంచిస్థితియం దున్నదని మీకు నివేదించుటకు సన్తోష ముప్పొంగుచున్నది. వీరికి మిశ్రచికిత్సలన్నగిట్టవు. కేవలమగు నార్షఆయుర్వేదీయ చికిత్సలయందును అష్టాఙ్గహృదయ చికిత్సలయందును అభిమానము మెండు.

అష్టాఙ్గహృదయమున నీదేశస్థుల కెంతటియభిమానము లేకున్న నచ్చటి యనన్తశయనపురాజ్యమున అష్టాఙ్గహృదయ

సాంప్రదాయికములగు చిన్నవియు పెద్దవియునగు రాజకీయ చికిత్సాలయములు అరువదికంటె నధికముగనుండును? వీరి కిందుగల యనుభవజ్ఞానాధిక్యముచే "సహస్రప్రయోగము" మున్నగు కొన్ని చికిత్సాగ్రన్థములనురచించి వాడుకయందుంచుకొనియున్నారు. ఇంతయేల వీరియొద్ద కెట్టిరోగివచ్చినను వారి కష్టాఙ్గహృదయము ననుసరించియే చికిత్సల జేయుదురు.

చెన్నపురికి తూర్పున ఓఢ్రదేశమువరకును రసతన్త్రమిశ్రచికిత్సను వాడుట మెండు. ఇచ్చట లఙ్ఘనచికిత్స నాచరించుట యెక్కువ. ఔషధములను అతిమాత్రకములుగ వాడుట స్వభావము. ఇచ్చట వాతరోగశోఫసన్నిపాతరోగములు మెండు. పూర్ణచన్ద్రోదయము, వసన్తకుసుమాకరము, మేహాన్తకము, లక్ష్మీవిలాసము, కాన్తవల్లభరసము మున్నగు నౌషధములను యన్త్రము మున్నగు సాధనములచే సిద్ధములుజేసి వాడుటయు అభ్రకకాన్తస్వర్ణాదిధాతువుల భస్మాదిపరిణామముల నందించి యుపయోగించుటయు మెండు. బసవరాజీయ వైద్యచిన్తామణి గ్రన్థములకు సంబంధించిన యౌషధములను వాడుట విస్తారము.

చెన్నపురికి పశ్చిమమున మైసూరురాజ్యమున ఆర్షతాన్త్రికవైద్యసంప్రదాయములను రెంటెనిగూడ నధికముగ నుపయోగించెదరు. స్నేహపాన అభ్యఞ్జనములను సామాన్యకుటీ



ప్రవేశరూప రసాయనచికిత్సలను వాడెదరు. లఙ్ఘనచికిత్స నెరుగరు. శమనచికిత్సల నధికముగ నుపయోగింతురు.

చెన్నపురికి దక్షిణమున కేవలముగ నగస్త్యసంప్రదాయమునకు చేరిన చికిత్స నాచరించుట యధికము. అచ్చటచ్చట ఆయుర్వేదీయ మిశ్రచికిత్సలును వైదికచికిత్సలును కూడ వాడుకలో నున్నయవి.

చెన్నపురికి వాయవ్యభాగమున కడప బళ్లారి మొదలగు మణ్డలములయందలి చికిత్సావిధాన మంతగ తృప్తికరముగ లేదు. దక్షిణాపథమున నన్నిప్రాన్తములయందును యవనచికిత్సలు గూడ నచ్చటచ్చట విరళప్రచారములుగ నున్నయవి.

దక్షిణహైదరాబాదురాజ్యమున తిబిసంప్రదాయమునకు చేరిన చికిత్సరాజకీయముగ వాడుక రసతన్త్రచికిత్స కంతగ ప్రాశస్త్యము లేదు.

## అంతట నాయుర్వేదాభివృద్ధి.

మైసూరు తిరువాన్కూరు కొచ్చి బరోడా జయపూర్ కాశ్మీరము పిలిభిత్ మున్నగు రాజధానులయందు ఆయాసంస్థానముల కధిపతులు ఆయుర్వేద వైద్యమును వృద్ధినొందింప కుతూహలులై కలాశాలలను ధర్మవైద్యశాలలను నియమించి మిక్కిలి యుపకరించుచున్నారు.

మరియు సిలోన్ కలకత్తా బొంబాయి చెన్నపురీ అలహాబాదు లక్నో పూనా రాజధానులయందు గొప్పన్యాయా

ధికారులును మంత్రిపుఙ్గవులును విద్యాధురీణులునగు కొందరు సఙ్ఘముగ జేరి ఆయుర్వేదకలాశాలలను ఆయుర్వేద ధర్మవైద్య శాలలను నేర్పరిచి లక్ష్యలక్షణ పరిజ్ఞానముతో నాయుర్వేద విద్యను చదివించుచున్నారు. మరియు నీ కలాశాలలయందు ఆయుర్వేదానుబన్ధముగ అనాటమీ ఫిజియాలజీ మున్నగు నాఙ్గలవైద్యక భాగములనుగూడ నాయాభాగముల దెలిసిన-యుపాధ్యాయులమూలమున విద్యార్థులకు నేర్పుచున్నారు.

పైజెప్పిన సరణి జక్కగ నాలోచించువారలకు ఆయుర్వేదము నలుదెసలవ్యాపించి మిక్కిలి యభివృద్ధిగాంచి యున్నదను విషయము స్ఫుటమగును.

రాజకీయ వైద్యశాసనము.

రెండువత్సరములకుపూర్వము బొంబాయియందు మన ప్రభువులచే "వైద్యకశాసన" మొకటినియమింపబడినదిగదా? అది యిప్పుడు చెన్నరాజధానియందును వ్యాపించెను. అంతటను సమమగు భావనకల రాజకీయతన్త్రజ్ఞులు ఆశాసనమున దేశీయవైద్యుల నేల యన్తర్భవింపజేయలేదో తెలియదు.

దేశీయవైద్యులకు తగుసామర్థ్యము లేకుండుటయే దీనికి హేతువని కొందరు తలంచుచున్నారు.

యోగ్యతాపరిశీలనా పక్షపాతులగు దొరతనమువారు ఆయుర్వేదసంబంధమగు యోగ్యతను నిపుణముగ విచారించి



ఆయుర్వేదమునకు మంచిప్రతిష్ఠను కలిగించుటకు ఆయుర్వేద చికిత్సలయందు నిపుణులగువారలకు "వైద్యరత్న" యను నపూర్వమగు బిరుదమునొసంగి తమయాస్థానమునందలి విద్వద్వైద్యులలో వారిని చేర్చుకొనియున్నారు. ఇది యిట్లుండ సామర్థ్యములేదను నుక్తులు దురుక్తులేగదా యగుచున్నవి?

ఈరాజకీయవైద్యకశాసనముచే నుత్తమాధమశ్రేణుల నందియుండు ఎమ్. డి. ఆస్పటల్ అసిస్టెంటు మొదలగువారందరునుగూడ యోగ్యతనుగురించి సామ్యము నందుచున్నారుగదా?

జ్ఞానవిషయమున హస్తిమశకములయంతరము కలిగియుండువారలుకూడ నీశాసనముచే యోగ్యతయం దెట్లు సములగుదురో తెలియకున్నది.

ఇట్టి తారతమ్యమేగదా మనవైద్యులయందును కనబడుచున్నది. దొరతనమువారొక కలాశాలనుస్థాపించి వారి జ్ఞానముల కవధుల నేర్పరచియుండుటచే వారియోగ్యత లప్పుడే ప్రత్యక్షము లగుచున్నవి.

ఇట్టిపరిపాటి మనయందు లేదనుట నిక్కువము. దొరతనమువారనుగ్రహించి ప్రయత్నముజేసిన నిది మనవారియందును అసాధ్యముగనుండదని తోచెడిని.

ఇంతదనుక లేని యీశాసనము జ్ఞానాధిక్యము మున్నగు విశేషముల నేమియు కలుగజేయజాలనిదిగ నుండుటచే నిది

యనావశ్యకమైనదని తలంతుము. కొన్ని సమయములయందు
వైద్యులు ప్రమాణపత్రము లీయవలసియుండును. సామాన్య
లట్టిప్రమాణపత్రముల నొసంగిన నయ్యవి న్యాయస్థానంబుల
సప్రమాణములుగ నుండదగవు. కావున నట్టిదానికొర కీశాస
నము అవసరముఅని కొందరు వచించునదికూడ యుక్తముగ
గనిపించదు. వారివారికుండు సహజమగు యోగ్యతకంటె నధి
కముగ అపూర్వమైన యోగ్యత నీశాసనము కలుగజేయు
నా? లేక యోగ్యులకై ఈశాసనము కలుగజేయబడెనా?
యన్నచో నీశాసనమువలన మున్నులేని యోగ్యత కలుగక
పోవుటచేతను, సహజమగు యోగ్యతకలవారికి యుపయోగ
రహితమగుటచేతను కూడ పైజెప్పిన రెండుప్రశ్నములకును
అవకాశము లేకయున్నది.

ఇట్లు ఫలాఫలములు ఏమాత్రమును లేక యింతకాలము
లేనిశాసన మవసరమాయనినచో పైజెప్పినరీతిని సమయ
విశేషములయందు వైద్యునిచే ప్రమాణపత్రము (సర్టిఫి
కెట్సు) లివ్వవలసియుండు సమయములమాత్ర ముపయో
గించునని ఈ శాసనమునకు ప్రయోజనమును జెప్పవలసి
యుండును. అట్లైన నీశాసనము లోకులకుపకారకము కాజాల
దనుట సుస్పష్టము.

ఎట్లన్న ఒకపల్లెయందు వాసముచేయు నొక గొప్పధని
కునకు ఆపదకలుగు ననుకొనుడు. అప్పుడు వారి కుటుంబము



నకు సంబంధించిన నిర్ణయములనుగురించి పరంపరగ వచ్చు
చుండు ఆగ్రామవైద్యుడే ప్రమాణపత్రము నొసంగును. శాస
నమున విహితులగువైద్యులు కొన్నిగ్రామములకైన నొకడు
లేకబోవుటచే నవసరసమయముల గ్రామ్యవైద్యు డొసంగిన
ప్రమాణపత్రమును న్యాయాధ్యక్షులు అంగీకరించరాదని యీ
శాసనముచే జెప్పుదురేని యాగృహస్థుని కుటుంబ సంబాధము
లగు నేర్పాటులన్నియు చెడిపోవునుకదా? తరుచుగ ప్రతిజిల్లా
యందలి ప్రతితాలూకాయందును రమారమి నూటయేబది
గ్రామములకు తక్కువలేక యుండును. ప్రతిగ్రామమునను
కొంచెమించుమించుగ రెండువేలవరకు ప్రజలుందురు ఈ
గ్రామముల నొక్కొకదానికిని రెండుమూడుక్రోశముల దూర
ముండును.

ఇట్టిస్థితియందు ఒక్కొకతాలూకాకు ఒక్కటియో లేక
రెండో రాజకీయ వైద్యశాలలును అందు నొక్కొక ఆస్పటల్
అసిస్టంటును నుందురు. వీరలు తమతాలూకా గ్రామములయం
దలి ప్రజలకందరకును సమయములయం దౌషధములను ఆప
త్కాలములయందు ప్రమాణపత్రికలను ఎట్లొసంగజాలియుం
దురో తెలియకున్నారము.

నూతనశాసనము కలుగుటకుముందే ప్రజలయవస్థ యి
ట్టులనున్నది. శాసనవ్యవహార మారంభమైన నికనెట్లుండునో

విజ్ఞులే యెఱుంగుదురుగాక. ఈశాసనము ప్రజలకువలెనే దొరతనమువారికిని లాభదాయకము కాదనుట సర్వవిదితము.

మరియు బొంబాయిశాసనపు పదునొకండవ పేరాయందును మదరాసుశాసనసభను ప్రవేశించిన చిత్తుశాసనపు పండ్రెండవ పేరాయందును "శాసనమున ప్రవేశపెట్టబడిన వైద్యవరులకంటె భిన్నులగువారిచే నిర్వహింపబడుచుండు ఔషధాలయాదులకు బహిరంగపు ద్రవ్యనిధుల (పబ్లిక్ ఫండ్సు) నుండి ద్రవ్యమును వినియోగింపరాదు" అను నియమము కనుబడుచున్నది.

(1) దీనిచే పూనా అజిమేరు మదరాసు అయోధ్య మున్నగు పట్టణములయందు పారిశుద్ధ్యనిర్వాహకసభ (మునిసిపాలిటీ) వారిచే పోషింపబడుచుండు ఆయుర్వేదౌషధాలయములు కేవలములగు నాయుర్వేదకళాశాలలయం దుత్తీర్ణులై శాసనమున చేరకుండు ఆయుర్వేద విద్వద్వైద్యులచే జరుపబడుచుండుటంజేసి అట్టి యౌషధాలయములకు ధనదానము దూరముచేయబడుటచే రాజావలంబనము లేక వానికి నిరాలంబన మగుననుటయు నిశ్చయము.

(2) వైద్యమాత్రులకు చికిత్సావ్యాపారము సామాన్యమేయైనను ప్రభువు లీశాసనముచే కొందరికిమాత్రము యోగ్యతకలదని నియమించుటచే నితరులకు యోగ్యత కలిగియున్నను లేనిదానితో సమమగునను నిది మఱియొకయనర్థము.



ఇట్లు అనర్థపరంపరను కలుగజేయునదియు నిప్పుడో జనంబును లోకోపకారమునకు హేతుభూతముగ చిరకాలమునుండి వెలయుచుండు నాయుర్వేదవిద్యయొక్క ప్రకాశనమునకు ప్రతిబన్ధకంబునునైన యీశాసనమును తొలగింపవలయునని ప్రజాపక్షపాతులగు దొరతనమువారును శాసననిర్మాణసభాసదులును బాగుగ నాలోచింతురుగాక.

నీరసావస్థ.

లోకమునందలి వైద్యశాస్త్రములకు మాతృస్థానమును వహించి యనేకవిషయములలో నభివృద్ధిగాంచిన యీచికిత్సావిధానములు పలుదేశముల వ్యాప్తిగాంచెను. అశోకమహారాజు ఆయుర్వేదీయకాయచికిత్సా శస్త్రచికిత్సాశాలలను నెలకొల్పి వాని నభివృద్ధిజేసెను. వైద్యశాలాస్థాపకుల లోనీతడే మొదటివాడని వాడుక. ఈయన వైద్యవిద్వాంసులను లంకాద్వీపాదులకనిపి అచ్చట నీవిద్యకు ప్రచారమును కలుగజేసెను. ఈ విద్య కాలిఫ్ఫుల కాలమున నరబ్బిభాషయం దలంకరింపబడియె. ఇట్లనర్గళాభివృద్ధి నందుచుండిన ఆయుర్వేదవైద్యరాజము పలువిధములగు కారణములచే క్రమక్రమముగ వ్యాప్తికి భంగము కలిగి చికిత్సాదులు అంతరింపజొచ్చెను. గ్రన్థరాజము లస్తమింపదొడంగెను. ఇట్టి హృదయభేదకమగు వార్తను మీకుం దు చెప్పవలయునన్న ఒడలు కంపమొందుచున్నది. మిక్కిలి దుఃఖమును కలిగించుచున్నది.

"నహి కస్తూరికామోదః శపథేననివార్యతే" యనునార్యోక్తి చొప్పున నీవిద్య కొలదికాలము నిగురుగప్పిన నిప్పువలె విధివశమున ప్రకాశించకయున్నను సర్వవేదశాస్త్రోద్ధరణమునకై నాటికాలములననుసరించి శ్రీశఙ్కరరామానుజ ఆనన్దతీర్థ చైతన్యవల్లభ సాయణాద్యాచార్యులు అవతరించి శాస్త్రములను మతములను ఉద్ధరించి కాపాడినట్లు వాగ్భట మాధవ చక్రదత్త ఈశ్వరసేన ఉగ్రాదిత్య పూజ్యపాద కుంభదత్త హస్తిచారి వైదర్భనర భావమిశ్ర శార్ఙ్గధరప్రభృతులు బయలువెడలి దీనిని తిరిగి యుద్ధరణము జేసిరి. నాటినుండియు నీవిద్య తిరిగి తలయెత్తసాగెను. కాని పదేపదే పరరాజులచే గలుగు దేశోపప్లవములచేతను రాజ్యములు సదా మారుచుండుటచేతను నియ్యది తిరిగి క్షీణింపజొచ్చెను. అట్లయినను దేశీయప్రభువులు వేదాదిశాస్త్రములను కాపాడినటులనే దీనినికూడ కాపాడియుండిరి. దానంజేసియే యింతవరకును ఏతత్సంప్రదాయసిద్ధచికిత్స గొంతవరకైనను మనము చూచుట కవకాశము కలిగినది.

వర్తమానస్థితి.

నూతనశకమనందగిన యీయాంగ్లరాజ్యారంభకాలమునుండియు దొరతనమువారు ప్రాచ్యపుస్తకశాలలను స్థాపించి ఆర్షగ్రన్థములను సంపాదించియుంచుటచేతను ఆర్షవిద్యావిభవాతిశయములనుసూచించు శాసనములను చిత్రపదార్థములను



అన్వేషించి జాగ్రతపరచుటచేతను వానిని పండితులచే పరిశోధించి ప్రచారపరచించుటచేతను పాశ్చాత్య పండితులు ఆర్షవిద్యలయం దభిమానము వహించి యిచ్చటిపండితుల సహాయమున వానిని చక్కగ నభ్యసించి అందుపై తమపాండితిచే నుత్తమములగు విమర్శనముల జేసి గ్రన్థములను వ్రాయుటచేతను మరియు నితరములగు ననేకకారణములచేతను తిరుగ నంకురించి తలయెత్తసాగెను.

ఈరీతిని భారతభూమియం దంతటను వైద్యకకలాశాలలనియు ధర్మవైద్యశాలలనియు గ్రన్థమాలలనియు ప్రతిమానవుని హృదయమునను ఆయుర్వేదశబ్దము ప్రవేశింపసాగెను. ఆయారాష్ట్రముల మహారాజులును రాజులును వారివారి రాజ్యములయందు ఆయుర్వేద కలాశాలలను స్థాపించి వృద్ధిపరుపసాగిరి. దేశీయసభ కనుబన్ధములుగనుండు మండలసభలయందు ఆయుర్వేదము నభ్యసించు విద్యార్థులకు మండల సభలనుండియు మునిసిపాలిటీలనుండియు విద్యార్థి వేతనముల నీయవలయునని తీర్మానముల జేయుచుండిరి. కొందరు సంస్కృతభాషామయములగు నాయుర్వేద గ్రన్థములను ఆయాదేశ భాషలలోనికి పరివర్తనము జేసి యచ్చొత్తించుచున్నారు. మరికొందరు ప్రాచీనములగు నాయుర్వేద గ్రన్థములను బహుప్రయాసచే సంపాదించి వైద్యపండితుల సహాయమున పరిష్కరించి వానిని

ముద్రించుచున్నారు. వేరొకరు ప్రాచీన నవీన సంప్రదాయము
లనుచేర్చి విమర్శింప తలపెట్టుచున్నారు.

ఆర్యవైద్యవిశారదులారా? మీహృదయముల నింకను వికసింపజేయు కొన్ని మాటలను చెప్పవలసియున్నది. ఆయుర్వేదీయచికిత్సల కుపయోగింపబడు ఓషధులను పాశ్చాత్య రసాయనశాస్త్రపద్ధతి ననుసరించి విమర్శింప దొరతనమువారు ప్రయత్నించుచుండునట్లు కర్ణాకర్ణిగ దెలియుచున్నది. ఈ కార్యమింతవరకును జరుగకపోవుటకు దేశబాంధవుడగు ఆనరబుల్ వి. కృష్ణస్వామిఅయ్యర్ ప్రభువుయొక్క నిర్యాణమే కారణమని తలచెదను.

ఇట్టి యుద్దేశము దొరతనమువారికి కలదనుటకు కొన్ని శుభసూచకములు ముందుకనుబడినవి. అవి యెవ్వియనిన?

ఆయుర్వేద యూనానీ వైద్యులకు "వైద్యరత్న" "షిఫాఉల్ములుక్" అను బిరుదులనిచ్చి ప్రభుత్వమువారు ప్రసిద్ధములగు ఆయుర్వేదయూనానీ వైద్యతంత్రములను తమ యాస్థానమునకు చేర్చుకొనుటయే. వేరుకాదు. ఇందుకు ముఖ్యకారకులును ప్రేరకులును ఎవ్వరైయుందురో మీయందరి హృదయములకును తెలిసియేయున్నది. నేను వేరుగజెప్పనక్కరలేదు. అయినను నాసంతోషము వివిధశాస్త్రధురీణులగు విద్వత్పత్రికాండులతో గూడియుండు నీ పరిషత్తునందు



ఆ మహానుభావుల నామోచ్చారణమును చేయ పురికొల్పుచున్నది. మొన్న మొన్న హస్తినాపురమున మేరీరాజ్ఞీసమేతుడై హార్డింజి ప్రభ్వితోగూడియుండు హార్డింజి ప్రభువను మహామంత్రితోగూడ మకుటాభిషేకమునందిన మన యేలికయగు ఆ జార్జిచక్రవర్తియే ఆ సార్వభౌముడే కారకుడు. ఆ మహామంత్రి పుంగవుడే ప్రేరకుడు. ఇట్లు సార్వభౌమావలంబనమును గాంచిన మన ఆయుర్వేదము అచిరకాలముననే యభివృద్ధి నందగలదని నమ్మెదను.

### ప్రకృతకర్తవ్యములు.

సకల భారతీయులకును సమమగు విశ్వ ఆయుర్వేద కలాశాలా స్థాపనమును అందు లక్ష్యలక్షణములతో అష్టాఙ్గవైద్యవిద్య గరపుటయు పాశ్చాత్యవైద్యపద్ధతికిం జేరిన అనాటమీ మొదలగువానిని బోధించుటయు ఆయుర్వేద గ్రన్థాలయముల స్థాపించుటయు ఓషధిప్రస్థముల నిర్మించుటయు ఔషధనిర్మాణశాలయందు తాన్త్రిక రసాయనశాస్త్రపద్ధతులకు జేరిన పదార్థములను విమర్శించుటయు ఆయుర్వేదచికిత్సా విశేషములను ఆతురాలయములను తెలుపు శిలాశాసనములను సంపాదించుటయు ప్రకృత కర్తవ్యములు.

మరియు చికిత్సాశాలలయందు ధర్మముగ మందుల నిచ్చుటయేకాక సాధ్యమగునంతవరకు రోగులకు తగు వస

తుల నేర్పరచి చికిత్సల జేయుటయు తన్మూలమున విద్యార్థులకు జ్ఞానాభివృద్ధిని చేయుటయు స్త్రీలనుగూడ విద్యార్థినులనుగ చేర్చి విద్యాభ్యాసము చేయించుటయు విద్యార్థుల జ్ఞానమునకై ఖనిజములు ప్రాణిజములు కాష్ఠౌషధులు మొదలగు పదార్థసామాన్యమును సేకరించి ప్రత్యేకప్రదర్శనశాలలను ఏర్పరచుటయు గూడ నావశ్యకమైయున్నది.

రసతన్త్రమున సోమనాథసిద్ధ పరిభాషల ననుసరించి అభ్యాసభాగమును బోధించుటయు చరకవిమానస్థాన భిషగ్జితీయాధ్యాయములను సుశ్రుత సూత్రస్థానమునందలి యాయుర్వేద సముత్థానీయ ప్రభాషణీయాధ్యాయములను అనుసరించి విద్యాభ్యాసమును లక్ష్యలక్షణసహితముగ చేయించుటయు చేయదగు ప్రథమ కార్యములు.

మరియు విద్యార్థుల విద్యాభ్యాసకాలము అయిదువత్సరములకు తక్కువ కానిదిగ నియమింపబడవలయును.

పై కార్యములు చక్కగ నెరవేరుటకును అందరికిని అనుకూలముగ నుండుటకును పైకలాశాలాదులు భరతఖండపు మధ్యభాగమున నొకరాజధానియందు స్థాపింపబడవలయును.

కార్యనిర్వాహక సఙ్ఘమునందు ముఖ్యముగ నాంగ్ల వైద్యవిశారదులను కూడచేర్చుకొని వారల సహాయమున ఆయుర్వేదతన్త్రముల ప్రకృతము ప్రచారములో లేని శాలా



క్యతన్త్రము కౌమారభృత్యము (శారీరశాస్త్ర ప్రసవశాస్త్రాదులు) అఙ్గప్రత్యఙ్గాది విభాగశాస్త్రములు ఆరోగ్యశాస్త్రము కెమిస్ట్రి ఫిజిక్సు మొదలగువానిని విమర్శనా పురస్సరముగ నేర్పవలయును.

లక్ష్యలక్షణములతో విద్యనభ్యసించిన పిదప పరీక్షక సభాసదుల నియమనానుసారముగ పరీక్షలయందుత్తీర్ణతనందినవారికే చికిత్సావిషయములయందు ప్రవేశించుట కధికారము నీయవలయును.

ఇట్టి నిబంధనములు మొదలగువానివలననే ఆయుర్వేదమచిరకాలమున నభివృద్ధికివచ్చును.

పలుదేశములయందలి ఆర్య ఆంగ్ల వైద్యాలయములయందభ్యసింపబడిన విషయములను విమర్శనారూపమున సిద్ధాన్తపరచి ప్రచారమునందించుటకై యొక వైద్యకపత్రిక యావశ్యకమైనది.

సోదరవైద్యులారా! పూజ్యులగు ఆర్యులసంతతికిచేరిన మనము మనయొక్క దేశము కాలము ఆచారము ప్రకృతి సాత్మ్యము మొదలగువానికి కొంచెమైనను విరోధములేక మనయొక్కయు మనదేశముయొక్కయు శీతోష్ణస్థితుల ననుసరించి పరమకారుణికుండగు భగవన్తుడు నిర్హేతుక జాయమాన కటాక్షమున యాయుర్వేదమును కల్పించెను. పూజ్య

మును ఈశ్వరదత్తమునగు నీ యాయుర్వేదమున్ను అభివృద్ధిజేసికొనుటకు ప్రకృతమున మనకు మంచితరుణమై యున్నయది. కావున నీ సమయమున దీని నభివృద్ధిచేయు విషయమున మీ మీ యావచ్ఛక్తులను వినియోగించి తగు ప్రయత్నములం జేయుట ముఖ్యమైనదిగ తలచెదను. ఇంతియగాక ఆయుర్వేదాభివృద్ధికై బహువిధముల శ్రమలనందెడివారలకు తగుసహాయమును చేయుచుండవలయును. మరియు మన శరీరారోగ్య భాగ్యమును కాపాడుటకై యేర్పడియుండు నిధియనందగు నాయుర్వేదమును గ్రన్థముద్రణారూపముననుచికిత్సాశాల ఆతురశాలల నిర్మాణరూపముననుప్రతిపల్లెయందును ప్రతిగ్రామముననుప్రతి పట్టణముననుశీఘ్రకాలములనే వెదజల్లి యభివృద్ధికి తెచ్చుటకు భగవన్తుడు మిమ్ము ప్రేరేపించుగాకయని యా పరమపదనాథుని పాదారవిన్దముల నమ్మి విరమించుచున్నాడను.

ఓం తత్సత్.

---

శ్రీమద్ధన్వన్తరయేనమః.

# ఆయుర్వేదాశ్రమ గ్రంథమాలయందు

సంస్కృతమునకు విపులమగు నాంధ్రవ్యాఖ్యాన రూపములుగను ఆంధ్రభాషయందు కేవల గద్యరూపములుగను వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారిచే సంప్రదాయానుసారముగ వ్రాయబడి ముద్రితములై క్రయమునకు సిద్ధముగనున్న

# ఆయుర్వేద వైద్యగ్రంథములు.

☞ శాశ్వతచందాదారులకు మా మాధవనిదానముతప్ప మిగత పుస్తకములు 100-కి 25-రూపా. తగ్గించి ఇవ్వబడును.

---

1. మాధవనిదానము - సంస్కృతము. విపులాంధ్రవ్యాఖ్యాయుతము. రోగనిదానాదులం దెలుపు గొప్ప వైద్యగ్రంథము. వెల ... ... 8 0 0
2 పథ్యాపథ్యము - సంస్కృతము. విశదమగు తెనుగు తాత్పర్యము వ్రాయబడినది. ప్రతిరోగమునకును హితాహితములగు పథ్యాపథ్యములను దెలుపును. వెల ... 1 0 0
3. ఆయుర్వేదపరిభాష - అనేక గొప్ప ఆయుర్వేదగ్రంథములనుండి సంగ్రహింపబడినది. సంస్కృతమునకు చక్కని తెనుగుటీక. ఆయుర్వేదౌషధముల జేయువారు ముఖ్యముగ నెరుగవలసిన విషయము లనేకము లిందుగలవు. వెల ... ... ... 1 8 0
4. అగస్త్యవైద్యము - దక్షిణదేశపు వైద్యసంప్రదాయములను బోధించు తెనుగువచనము. వెల ... 0 4 0

5. ఆయుర్వేదాంగశల్యతంత్రము – ఆయుర్వేదమున శస్త్రచికిత్స నెట్లు కనుగొనినదియు దానినభ్యసించు మార్గములను బోధించు తెనుగువచనము. వెల ... 0 4 0

6. వస్తికర్మము – "పిచికారి" యొక్క స్వరూపమును దాని నుపయోగించు విధమును అందుపయోగింపబడు చికిత్సామార్గములును వ్రాయబడియుండు తెనుగు వచనము. వెల ... ... ... 0 4 0

7. అర్కప్రకాశము – ప్రతిమూలికనుండియు "అరకుల" దీయుట కుపాయములను వానిచే రోగములను కుదుర్చు మార్గములను ఆయుర్వేదపద్ధతి ననుసరించి తెలుపు గొప్పచికిత్సా గ్రంథము. సంస్కృతమునకు విస్తృతమైన యాంధ్ర వ్యాఖ్యానము వ్రాయబడియున్నది. వెల ... ... ... 2 0 0

8. భేషజకల్పము – వైద్యప్రక్రియలను తెలుపు సుప్రసిద్ధ ఆంధ్రపద్యకావ్యము. అతి విపులమగు నాంధ్ర వ్యాఖ్యానము కలదు. వైద్యులుమాత్రమే గాక ప్రతి యాంధ్రుడును చూడతగినయుత్తమగ్రంథము. వెల... 1 0 0

9. రసప్రదీపిక–సుప్రసిద్ధమైన రసప్రక్రియలను బోధించు తెనుగు పద్యకావ్యము. రసార్ణవాది గ్రంథముల సహాయముచే తేటతెనుగున తాత్పర్యము వ్రాయబడినది. ఇందు తెలుపబడియుండు లోహాదిధాతువులకు ఇంగ్లీషు పేర్లు చూపబడియున్నవి. వెల ... ... 1 8 0

10. ఆయుర్వేద(చరిత్ర)ము – ఆయుర్వేదము అందలి విషయములు మొదలగువానిని విపులముగ చర్చించు తెనుగు వచన గ్రంథము. వెల ... ... 0 4 0





## ప్రకృతము ముద్రణములోనుండు ఆయుర్వేద వైద్యగ్రంథములు.

—:o:—

చరకసంహిత – చికిత్సాశాస్త్రములలో నింతటి యుత్తమగ్రంథ మింకొకటిలేదు. దీని విఖ్యాతినిబట్టి ఇందలివిషయముల వివరించుట యనవసరము. ఇది చక్రపాణి, గంగాధరకవిరాజ, యోగీంద్రనాథులు, మొదలగు వ్యాఖ్యాతల వ్యాఖ్యలననుసరించి విపులముగ విశేషవిషయముల కూర్చి రచింపబడిన యాంధ్రవ్యాఖ్యతో కూడియున్నది.

సుశ్రుతసంహిత – శస్త్రచికిత్సను శారీరవిభాగములను దెలుపు విఖ్యాత వైద్యగ్రంథము. ఇది చక్రపాణి, డల్వణుడు మొదలగువారి వ్యాఖ్యానముల ననుసరించి యనేక నూతనవిషయములం జేర్చి అతిప్రౌఢముగ వ్రాయబడిన యాంధ్రవ్యాఖ్యాసహితము. యంత్రశస్త్రములయొక్కయు శారీరవిభాగములయొక్కయు ప్రతిమలిందు ముద్రించబడుచున్నవి. మరియు నిందలి శారీరసంబంధములగు పేరులకు యింగ్లీషుతో గ్లాసరికూడ జేర్చబడియున్నది.

ఆయుర్వేదచికిత్సాప్రకాశిక – ఇందు వ్యాధులకన్నిటికిని ఆయుర్వేద సంప్రదాయమున మా స్వానుభవముచే నిశ్చితములైన సులభములగు కషాయ, లేహ్య, చూర్ణ, స్వరసాది చికిత్సాప్రక్రియలు ప్రతిచోటను దొరుకు పదార్థములతో ప్రతివారును జేసుకొనుటకు అనుకూలమైనవి వ్రాయబడియున్నవి.

అష్టభాషావైద్యకనిఘంటువు – మనరాజధానియందలి వైద్యుల వ్యవహారములో గల మూలికలు సంస్కృతము, తెనుగు, అరవము, మళయాళము, కన్నడము, హిందూస్తాని, ఇంగ్లీషు, ల్యాటినీభాషలలో

ఆయుర్వేదాశ్రమం, 55, ఆచారప్పన్ వీధి, జి. టి. మదరాస్.

నాయామూలికలు చక్కగ దెలియునటులను సాధ్యమగునంతవరకు ఆమూలికాదుల గుణములతోకూడ వ్రాయబడియున్నది.

నవనాథసిద్ధప్రదీపిక - ఇయ్యది పేరయామాత్య విరచితపద్యకావ్యము, ఇందు నవనాథసిద్ధులు దేశహితమునకై గనుగొనిన గొప్పగొప్పసిద్ధప్రక్రియలు మెండుగాగలవు.

శారీరము (ఫిజియాలజీ). శారీరవిభాగము (అనాటమీ)

ఈరెండును మాకలాశాలయందలి గొప్ప ఆంగ్లవైద్యవిశారదులచే విరచితములు. ఆంధ్రమున ఇట్టి గ్రంథములు యింతవరకు లేవు. చిత్రప్రతిమలతో ముద్రితము.

మధుమేహము, రాజయక్ష్మ, చలిజ్వరము, విషూచి, ఓషధితత్వము మొదలగు గ్రంథములు శాస్త్రచర్చలతో వచనరూపముగ నుండును.

మరియు భావప్రకాశిక, బృందమాధవము, కల్యాణకారకము, రసార్ణవము, రసరత్నసముచ్చయము, రసరత్నాకరము, రసపరిభాష, నిదానపరిశిష్టము మొదలగు గ్రంథములను నాంధ్రవ్యాఖ్యలతోడ ముద్రించుచున్నాడను.

---



## నాగరాక్షరములతో ముద్రణలోనున్న ప్రాచీన వైద్యగ్రంథములు

ఆయుర్వేదసూత్రములు - నిత్యానందసనాథవిరచిత వ్యాఖ్యాసహితము. ముద్రణ త్వరలో పూర్తియగును.

| | |
|---|---|
| భేడసంహిత. | మహర్షి భేడవిరచితము. |
| కల్యాణకారకము. | ఉగ్రాదిత్యాచార్య విరచితము. |
| యోగశతకము. | వరరుచివిరచితము (వ్యాఖ్యాసహితము) |
| ప్రశ్నోత్తరరత్నమాల. | అగ్నివేశ పునర్వసు సంవాదరూపము. |
| భేషజకల్పము. | చన్ద్రనాచార్య వ్యాఖ్యాసహితము. |
| వాగ్భటమండనము. | పండితభట్ట నరహరివిరచితము. |
| చారుచర్య. | భోజమహారాజ విరచితము. |
| ఆయుర్వేదసారము. | రేవణసిద్ధవిరచితము. |
| ఆనందకందము. | మన్థానభైరవసిద్ధ విరచితము. |
| కాశ్యపసంహిత. | మహర్షి కశ్యపవిరచితము. (అతిప్రాచీనము) |
| శివతత్వరత్నాకరము. | కేరళిబసవరాజ విరచితము. |
| భేషజతర్క. | ప్రాచీనము. |
| రసప్రదీపము. | ప్రాచీనము. |
| నాడీతంత్రము. | ప్రాచీనము. |

మొదలగు గ్రంథములు అనేక గ్రంథముల సాహాయ్యమువలన నాయుర్వేదాశ్రమమున జక్కగా బరిశోధింపంబడి ముద్రణమునకు సిద్ధముగనున్నయవి మఱియు నీ గ్రంథములుగాని యింక నితరవైద్య గ్రంథములుగాని యెవరివద్దనైన నుండినయెడల మాకార్యాలయమునకు దయతో బంపిన వందనములతో నందుకొని మాపుస్తకములతో సరిచూచుకొని పంపెదను.

మఱియు ముద్రణానంతరము ముద్రితమగు నొక గ్రంథమునుగూడ నుచితముగ బంపెదను.

వైద్యరత్న, పండిత డి. గోపాలాచార్లు,
ఎ.వి.ఎస్., ఎ.ఎమ్.బి.,
ఆయుర్వేదాశ్రమం, జి.టి. మదరాస్

టెలిగ్రాఫ్ అడ్రసు
"పండిట్" మదరాస్.

# శాశ్వతపు చందాదారులు.

---

మా గ్రంథమాలయందలి గ్రంథములు ప్రతి ఆంధ్రునకును ప్రతి ఆంధ్ర దేశపు వైద్యునకును ఇతరవైద్యులకును మిక్కిలి యుపయోగమగునట్లు తక్కువ వెలల కీయదలచినారము.

మా గ్రంథములన్నియు చవుకగా కావలయునేని మా గ్రంథమాలకు శాశ్వతపు చందాదారులగుటయే యుత్తమము. శాశ్వత చందాదారులగువారు మొదట చందాధనము నీయనక్కరలేదు.

తాము సంతకము జేసిపంపిన దరఖాస్తు అందగానె ఇదివరకు ప్రకటింపంబడిన గ్రంథములలో నిలవయున్న గ్రంథములన్నియు తమకు వి. పి. గా పంపబడును. తరువాత క్రొత్తగ్రంథములు ఎప్పటికప్పుడు వి. పీ. గా పంపబడుచుండును.

చందాదారులగువారు మేము పంపిన వి. పి. లు తిరుగగొట్టకుండగలందులకు యెక్కువగ ప్రార్థించెదము. అట్లు తిరుగగొట్టినవారివద్దనుండి గ్రంథముల పూరా వెలలును మాకగు నష్టమును క్రమముగ రాబట్టుకొనబడును.

కొందరివలె మున్ముందుగ పోషకులవద్దనుండియు చందాదారులవద్దనుండియు ద్రవ్యమును స్వీకరించి ఒకటిరెండు సంచికలనుమాత్రము గొచ్చటనో ముద్రించి బంపియో లేక పంపకయోయుండు గ్రంథమాలలవలె గాక మా గ్రంథమాలయందలి గ్రంథములను ఆంధ్రసోదరుల సౌకర్యమునకై విశేషమగు మూలధనముతో స్వకీయమగు ముద్రణాలయమును యేర్పరచుకొని అధిక ధనవ్యయముతో పుస్తకములను ముద్రించి ముద్రణము పూర్తియైనతోడనే దెలిపి వి. పి. మూలకముగ పంపుచున్నారము.

శాశ్వతచందాదారులుగ నుండగోరువారు ముందుగ ప్రవేశరుసుము క్రింద రెండుఅణాలు పోష్టుబిళ్లలను పంపుకొనవలెను. శాశ్వతచందాదారులుగా నున్నవారికి మా గ్రంథమాలయందలి గ్రంథములన్నిటికిని నియమితములగు ఖరీదులో రూపాయికి నాలుగణాలు తగ్గించి యివ్వబడును. చక్కని కాకితములు చక్కనిఅచ్చు మనోహరమగు బైండుతో జేరిన ఆయుర్వేద వైద్యశాస్త్ర గ్రంథములు ఇంతకన్న తక్కువవెలల కిచ్చువారు ఆంధ్రదేశమునందెచ్చటను లేరని జెప్పగలము.

శ్రీరస్తు.

భరతఖండమునందలి కలకత్తా, బొంబాయి, బనారస్ మొదలగు పత్తనములయందు జరిగిన చిత్రవస్తు మహాప్రదర్శనములయందు బంగారు పతకములను, మొదటితరగతి యోగ్యతాపత్రములను శ్రీ శ్రీ శ్రీ గద్వాలమహారాణిగారినుండి మహామారినివారకౌషధములకై బంగారు పతకమును బొంది శ్రీమత్పంచమజార్జిచక్రవర్తి సార్వభౌమునిచే "వైద్యరత్న" యను బిరుదమునుబొందిన ఆయుర్వేదమార్తాండ, భిషఙ్మణి

## పండిత డి. గోపాలాచార్యులు, ఏ. వి. ఎస్.,

గారిచేత శాస్త్రోక్తముగ తయారుచేయబడిన

# ఆ యు ర్వే దీ యౌ ష ధ ము లు.

ప్రమేహభంజని:—మధుమేహము, బహుమూత్రము అను క్రూర వ్యాధులను పోగొట్టి యెట్టి యవస్థలోనయినను రోగికి శ్రమనివారణమును కలుగజేయుటకు నిశ్చయమయిన యౌషధము. ఈ యౌషధమువలన గుణమునుగాంచిన గొప్పవారనేకులు దీనివలన తమకు కలిగిన అధిక ప్రయోజనమును కృతజ్ఞతాపూర్వకముగ నొప్పుకొనుచున్నారు. వెల రు. 2—8—0.

వజ్రదంతచూర్ణము:—ప్రతిదినము దంతధావనము జేసినయెడల దంతములనుండి రక్తము కారకుండజేసి దంత సంబంధమగు నితరవ్యాధులను నిర్మూలముచేసి దంతమూలములకు మిగుల దార్ఢ్యము గలుగచేయును. వెల డబ్బా 1-కి 4 అణాలు.

వృష్యయోగము:—వీర్యవృద్ధినిచ్చి బలమును కలుగచేయుటయందు ఉత్తమోత్తమమయినది. మెదడునకును మెదడునందుండు నరములకును ప్రధానావయవములకును పటుత్వమును, రక్తవృద్ధిని, దృఢబలమును కలుగజేయుటయందిది సంజీవివంటిది. వెల డబ్బా 1-కి రు. 1—0—0.

పూజ్యపాదవటి:—నరముల నొప్పులను నరముల ఈడ్పులను పక్షవాతములను, చచ్చువాతములను నిర్మూలముచేయును. హృదయమునకు మిక్కుటమగు బలమును గలుగజేయును. వెల సీసా - 12 - అణాలు.

పంచాననలేపము:—ఈ యౌషధము తామరను శుభ్రముగపోగొట్టి విడువకుండ నుపయోగించినయెడల తిరిగి యెప్పటికి పొడచూపకుండచేయును.
వెల డబ్బా 1-కి 8-అణాలు.

సుఖవిరేచనవటి:—మాత్ర మినపగింజకంటె నధిక ప్రమాణముండదు. అసహ్యములేకుండ సేవించదగినది. మలబద్ధకమును నివారించును. పసిబిడ్డలు కూడ నుపయోగింపనగును. వెల సీసా 1 కి 8-అణాలు.

అజీర్ణపంచాననము:—అజీర్ణమువల్ల కలిగెడు అనేక వ్యాధులలో జ్వరము, నిద్రలేకపోవుట, రొమ్ములో బరువు, నిస్త్రాణ, బలహీనము, కడుపునొప్పి యనునవి పోగొట్టుటకు రాజౌషధము. వెల డబ్బా 1-కి రు. 0-8-0.

తాంబూలవటి:—ప్రతిదినము తాంబూలముతో నుపయోగించుట కుద్దేశింపబడినది. మిక్కిలి బలమును కలుగజేయుటయేగాక, తాంబూలమునకు రుచిని పుట్టించి నోటిదుర్గంధమును పోగొట్టి, కంఠనాళములకును స్వరమునకును జీర్ణశక్తికిని సహాయముచేయును. 50 మాత్రలుగల సీసా 8-అణాలు.

కేశప్రసాదనతైలము:—శిరస్సు చల్లపడునట్లు చేసి వెండ్రుకలు ఊడిపోకుండ పెరుగుటను వృద్ధిచేసి, అకాలమున నెరవకుండునట్లుచేయును. మెరుగునూనెలకు బదులు దీని నుపయోగించుటచే కలిగెడు లాభము అసదృశము. వెల సీసా 1-కి రు. 1.

భృగువటి:—రెండురోజులలో సెగరోగములను పోగొట్టి మర్మస్థానమునందలి విషజల స్రావము నాపును. దీర్ఘకాలమునుండి బాధింపుచున్న వ్యాధియందు వారముదినముల సేవవలన రోగిని మిక్కిలి మంచిస్థితికి తెచ్చుట నిస్సంశయము. వెల 24 మాత్రలుగల సీసా 1-కి రు. 1—8—0.

చంద్రకల:—ఒంటికణత నొప్పులు, అన్నివిధములగు తలనొప్పులు, పడిశము, రొమ్ముపడిశము, కల్లె, దగ్గు, సామాన్యవాపులు, కీళ్ళవాపులు మొదలగు వాటియందు దీనిని రుద్దినతోడనే బాధ మాయమగును. ఇది ప్రతియింట నుండదగిన కుటుంబౌషధము. వెల బుడ్డి రు. 0—8—0.



అశోకవటి:—స్త్రీల దురవస్థలను తొలగించుటకు అమూల్యమయిన యౌషధము. ఋతు సంబంధమగు నొప్పులను, ఇతరజబ్బులను, రజోగర్భాశయములు చెడుటవలన నేర్పడినవ్యాధులను మొదలంట రూపుమాపుటలో నిస్సందియము. వ్యాధినివారణమయినపిదప గర్భోత్పత్తియు సుఖప్రసవమును ఈ యౌషధ సేవవలన నేర్పడుచున్నవి. వెల సీసా 1-కి 12-అణాలు.

రక్తశోధక:—సవాయి మేహములచేతను, రసదోషములచేతను, యింక ననేక కారణములచేతను, చెడిపోయిన రక్తమును శుభ్రపరచును. కురుపులు, చీడ, తామర, మేహపొడలు, మొదలగు చర్మదోషములను నిర్మూలముజేయును. నోటిపూతలను, అపుడపుడువచ్చు కండ్లకలకను బోగొట్టును.

వెల బుడ్డి రు. 2—8—0.

అబలాసంజీవిని:—(స్త్రీలకుగలుగు మదమూర్ఛలకు సిద్ధౌషధము.) యువతులగు స్త్రీలకు ననేక కారణములచే గలుగు అపస్మారములను, మూర్ఛలను, గర్భాశయదోషములను, పలువిధ మనోవికారములను, బోనణచును. గర్భిణీ స్త్రీలు దీనిని సేవించిన గర్భాశయమునకు మిక్కిలి బలమును, సుఖప్రసవమును, గలుగంజేయును, మఱియు, ఇయ్యది స్త్రీలకేకాక మనుజసామాన్యముగ సంభవించు మూర్ఛలను అపస్మారములనుకూడ నశింపజేయును.

వెల బుడ్డి రు. 1—8—0.

వృశ్చికదంశ నివారిణి:—తేలుకుట్టినచోట దీనిని రుద్దినయెడల, 5 నిమిషములలోనే కుట్టినచోటకూడ బాధలేకుండునట్లు జేయునని అనేకవేల మహనీయులు కొనియాడుచున్నారు. వెల బుడ్డి రు. 0—8—0.

జంబీరరసాయనము:—(పైత్యములకు మంచిది.) నోట నీళ్లూరుట, తలతిరుగుట, రొమ్మునొప్పి, రొమ్ములోమంట, కడుపులో త్రిప్పుట, వాంతియగుట, పసరువెళ్లుట ఈ మొదలగు పైత్యవికారములకు మిగుల మంచిది. మఱియు పైత్యాజీర్ణములకు మిక్కిలి గుణకారి. వెల బుడ్డి రు. 0-8-0.

చ్యవనప్రాశన:—ఉబ్బసము దగ్గులను, క్షయదగ్గులను, సామాన్యపుపొడిదగ్గులను, రొమ్ముపడిశము వలన కఫము జాస్తిగానుండుటను, నివర్తిజేయును. రొమ్మునకు ఊపిరితిత్తులకు బలమును కలిగించును. క్షయరోగులంతటివారి కసమానపుష్టిని శరీరమునకు శక్తినికలిగించును. బాలురును, వృద్ధులు

నుగూడ సేవించదగును. బలమునకు దీసికొను చేపనూనెకంటె (Cod liver Oil) వేయిరెట్లు పని జేయును. ఉబ్బసమువగయిరాలను రాకుండ కాపాడును.

వెల టిన్ను రు. 2—8—0.

అశ్వనివటి:—ప్రతిదినము వచ్చెడి జ్వరములను, దినమువిడిచి దినము వచ్చెడి జ్వరములను, వర్షాంతములవరకు విడువని జ్వరములను, బల్లలతో కూడిన జ్వరములనుకూడ నతిశీఘ్రములో మాయము జేయును. వెల బుడ్డి రు. 0-12-0.

మకరధ్వజ:—రోగసామాన్యములను రాకుండ జేయుటయందును, అనేక కారణములచేత బలహీనతనొందిన వారికి బలమును కలుగజేయుటయందును, హిందూవైద్యశాస్త్రమున నింతటి ఖ్యాతిగలమందు వేరొకటిలేదు. నియ్యది బంగారు మొదలగు మిక్కిలి విలువగల పదార్థములచేత తయారు చేయబడినది. వెల తు 1-కి రు. 24—0—0.

7 డోసులమందు రు. 1—0—0.

సిద్ధ మకరధ్వజ:—పై మందువలెనే అత్యధికమగు బలమును, మెదడుకు నరములకు శక్తిని కలిగించును. మఱియు నపుంసక దోషములనుకూడ బోగొట్టును. నియ్యది ముత్యములు, బంగారు, మఱియు యితర లోహములతో చేయబడిన యమూల్యౌషధము. వెల తు 1-కి రు. 80—0—0.

7 రోజులమందు రు. 5—0—0.

నారాయణతైలము:—పక్షవాతములు, చచ్చువాతములు, కీళ్ళనొప్పులు, వాపులు, శిరోవాతములు, దీనిని పైన రుద్దుటచేత నిర్మూలము చేయును. వెల బుడ్డి రు. 2—8—0.

నాడీవ్రణాంతక:—నారికురుపులకు వజ్రాయుధమువంటిది. గొప్పవారనేకులు దీనిని ఉపయోగించి దీనిపేరు సార్థకమనిరి.

వెల బుడ్డి రు. 0—12—0.

మాతులుంగరసాయనము:—(గర్భిణీ స్త్రీలకు సంజీవి) గర్భిణి స్త్రీలకు అనేక కారణములచే సంభవించు వాంతులు మొదలగు వ్యాధులను, బలహీనమును బోనణచును. మఱియు గర్భాశయమునకు బలమును కలుగజేయును. అధికప్రయాసచే ప్రసవించెడి స్త్రీలకు బాధయనునది దెలియకనే సులభముగ ప్రసవము జేయుటలో గర్భిణి స్త్రీలపాలిటికి సంజీవని యిదియే.

వెల బుడ్డి రు. 1—8—0.



వ్రణరోపణి:—గజ్జి, చీడ, పాసినపుండ్లు, కాలినపుండ్లు వీనిని నిస్సంశయముగ నిర్మూలము జేయును. వెల డబ్బా రు. 0—4—0.

వసంత కుసుమాకరం:—బహువిధ మూత్రవ్యాధులకును, మూత్రమందుగల తీపు దోషములకును, ఆర్యవైద్యశాస్త్రమున నుత్తమతమౌషధమని ఘంటాపథముగ జెప్పంబడుచున్నది. మఱియు మధుమేహ బహుమూత్రవ్యాధులచే గలుగు రాచ కురుపులను రాకుండజేయును. గుండెకాయకును, నరములకును, బలమునిచ్చుటలో దీనికి సరిపోల్చుటకు వేరొకయౌషధము నాకు గోచరముగాకున్నది.

వెల తు 1-కి రు. 30—0—0; 7 రోజులమందు రు. 5—8—0.

ఆత్రేయవటి:—కీళ్ళనొప్పులు, సవామేహవాతనొప్పులు, కీళ్ళవాపులు మొదలగు వానిని, విడువకుండెడు దీర్ఘకాలపు నొప్పులనుకూడ రూపుమాపును. వెల బుడ్డి రు. 0—12—0.

బాలసంజీవనివటి:—ఈ మాత్రలను ప్రతి నిత్యము రేపుమాపుకటి చొప్పున యుపయోగించిన, అజీర్ణములు, దోముపిరేచనములు, జలుబు, దగ్గు, జ్వరము, మొదలగునవి రాకుండయుండును. వచ్చిన నిర్మూలముజేసి ఆరోగ్యమును గలిగించును. పసిబిడ్డల సంరక్షణకుగాను ప్రతికుటుంబమున నుండదగినది.

వెల 50 మాత్రలుగల సీసా 1-కి రు. 0—8—0.

విచిత్రరత్న లేపం:—చాలాకాలమునుండి పీడించెడు సవాయిపుండ్లు, కొరుకుపుండ్లు, భగందర వ్రణములు, గండమాలా వ్రణములు, ప్రధానావయవమందలి వ్రణసామాన్యములు, స్త్రీల మర్మస్థలములయందలి వ్రణములు, మేహవ్రణములు, మొదలగువానిని శీఘ్రములో గుణము జేయును.

వెల డబ్బా 1-కి రు. 1—8—0.

కదళీకందపాకం:—రక్తవిరేచనములను, నోటివెంట, ముక్కువెంట, పండ్లవెంట రక్తముపడుటను, రక్తవమనమును, రక్తకాసుమును, శరీరతాపమును, ఎదురుగొమ్ము, అరకాళ్లు అరచేతుల మంటలను, మూత్రనాళమందలి పోట్లు మంటలను బోనణచును. సెగరోగులకుగల మూత్రపు చురుకునకును చాలామంచిది. పసిబిడ్డల కానకములకు సంజీవనియె.

వెల టిన్ను 1-కి రు. 1—8—0.

మృగమదవటి:—కస్తూరి మాత్రలుగల ఒక ఈసీసా ప్రతికుటుంబములో నుండవలసియున్నది. సకాలములో నీ మాత్ర లుపయోగింపబడిన యెడల జ్వరమునురాకుండ జేసికొనవచ్చును. మఱియు జలుబు, రొమ్ముపడిశము, సన్నిపాతములను బోగొట్టును. వెలసీసా 1-కి రు. 1.

సిద్ధగంధక రసాయనమ్:—రక్తశుద్ధినిచేయుటనుండీ యౌషధమునంగల అత్యద్భుతమగు గుణమునుబట్టి చర్మవ్యాధులు కొద్దిరోజులీ యౌషధసేవవలన నివారణమగుచున్నవి. ఏడుదినములయౌషధమునకు వెల రు. 2-8-0.

వాశారిష్టం:—జలుబుతో కూడినట్టిగాని, జలుబులేనట్టిగాని ఉబ్బసములను నశింపజేయును. క్షయరోగులకు, రొమ్ముపడిశములకు, ఊపిరితిత్తులకు జేరిన ప్రతివ్యాధికిని, రక్తపిత్తమునకును, రత్నమువంటిది.

వెల బుడ్డి రు. 1—0—0.

సౌరణపాకం:—రక్తముతోకూడిన మూలశంకను అద్భుతముగా కుదుర్చును. మఱియు మొలలతోకూడిన మూల జాడ్యమును కొంతకాలము సేవించిన నివర్తిజేయగలదు. వెల టిన్ను రు. 2—0—0.

స్వర్ణక్రవ్యాదరస:—చిరకాలమునుండియున్న అజీర్ణవాతములకు అమ్లపైత్యములకు అసమానమైనది. కడుపుబ్బరములను, పులితేపులను, బోనణచును. 7 రోజులమందు రు. 4—0—0.

స్వర్ణవంగం:—శుక్లనష్టములకు, స్వప్నస్ఖలనములకు, సంజీవివంటిది. మఱియు చిరకాలపు శగరోగములను ధ్వంసముచేయును.

7 రోజులమందు వెల రు. 4—0—0.

చందనబలాలాక్షాతైలము:—ఉబ్బసరోగము, క్షయరోగము, పురాణ జ్వరములు, పాండు, తలనొప్పులు, శిరోవాతములు, శరీరతాపము, ఉడుకు—ఇవియన్నియు, ఈతైలముచే నొకటిరెండుతడవలు అభ్యంజనము చేసుకొనిన గుణమగును. మఱియు మెదడుకు చలవను, శక్తినికలిగించును.

వెల బుడ్డి 1-కి రు. 2—0—0.

ఖండకూశ్మాండలేహ్యము:- ఎండిపోవుశరీరస్వభావముగలబిడ్డలకు పెద్దలకును మాంసమునకు పుష్టిజేయును. క్షయము, ఉబ్బసము, పొడిదగ్గు, కలవార్లకు మిగుల మేలుజేయును. ఊపిరితిత్తులకు మంచి బలమును గలుగజేయును. వెల టిన్ను 1-కి రు. 2—8—0.

# వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు,

## ఎ. వి. ఎస్., ఎ. ఎమ్. బి, వారి

## జీవామృతము.

హిందూదేశమందలి మంచిమూలికలచే తయారుచేయబడినది.

రక్తమును వృద్ధిజేయును
మేహవాతనొప్పులను బోగొట్టును
అన్నివిధములగు బలహీనములను అణచును
పాండురోగులకు మంచిది
గుండెదడను నివారణజేయును
గర్భకారకములను దరుమును
బాలులకు గర్భిణీలకు నుత్తమము
చనుబాలను వృద్ధిబరచును
మూర్ఛలకు మంచిది
మెదడుకు బలము గలుగజేయును
నరములకు శక్తిని హెచ్చించును
విద్యార్థులకు ప్రాణమిత్రము
ప్రాణశక్తిని హెచ్చించును
క్షయరోగులకు మిగుల మంచిది
కాసరోగులకు అమృతము
గుండెకాయకు మిక్కిలిబలమునిచ్చును
ఊపిరి తిత్తులకు అధిక బలముజేయును
ఉబ్బసరోగులకు మిగులహితము.

వెలబుడ్డి 1-కి రు 3-0-0.

12 బుడ్లు వెల రు 34-0-0.

ప్యాకింగు పోస్టేజి వేరుగా నివ్వవలెను.

## అమృతామలకతైలం

శిరస్సునుకండ్లను సర్వదా కాపాడును
సర్వవిధ శిరోరోగములను బోగొట్టును
పార్శ్వనొప్పులను దూరముజేయును
కణతనొప్పులను నిర్మూలముజేయును
పీనసరోగముల రానివ్వదు
మెదడుకు బలముజేయును
కర్ణరోగములను నశింపజేయును
కండ్లకు చలువజేయును
అపస్మారముల దూరముజేయును
తలనరములకు బలమునిచ్చును
నేత్రరోగములకు హితము
మూర్ఛలను బోగొట్టును
తలచుండును బోనణచును
వెండ్రుకలను నెరయకుండజేయును
విద్యార్థులకు సర్వదా హితము
వెండ్రుకలను పట్టుకుంచవలెబెంచును
యోచన జేయువారికి మిక్కిలి హితకరము
మాడుపోట్లను నిర్మూలముజేయును
చర్మరోగులకు మంచిజేయును
తలమంటలను మాన్పును
అధికనిద్రను తగ్గించును
నిద్రలేమిని బోగొట్టును
దీనిగుణములు అనుభవజ్ఞులకు దెలియును

వెల బుడ్డి 1-కి అణాలు 12.

ఆయుర్వేదాశ్రమం, 55, ఆచారప్పన్ వీధి, జి. టి. మదరాస్.

# వైద్యరత్న పండిత డి. గోపాలాచార్లు

ఎ. వి. ఎస్., ఎ. ఎమ్. బి., వారి

## ప్లేగుమందులు.

**మహామారి (ప్లేగు) నుండి ఎంతమాత్రము భయములేదు.**

శ్రీ గద్వాల మహారాజాగారి మెప్పుచే బంగారు పతకమును బొందిన మా ప్లేగు మందులను గడచిన పదునాలుగు వత్సరములుగ బర్మాలోను ఇండియాయందలి పలుభాగములయందును ఉపయోగించి అనేక ప్రాణులు సుఖమును బొందిరి.

ప్లేగుగల ప్రదేశముల దీనిని మేము చెప్పు ప్రకారము సేవించుచుండిన ప్లేగు బాధ యెంతమాత్రము బాధించదు. చిన్నలు, పెద్దలు, గర్భిణి స్త్రీలకు కూడా నుపయోగించవచ్చును.

### హైమాదిపానకం.

| | | |
|---|---|---|
| పెద్దసీసా 1-కి | రూ. | 1—0—0 |
| చిన్నసీసా 1-కి | | 0—10—0 |

### శతధౌతఘృతం.

| | | |
|---|---|---|
| పెద్దసీసా 1-కి | రూ. | 0—12—0 |
| చిన్నసీసా 1-కి | | 0—8—0 |

## కలరామందులు.

మా కలరామందులు అనేక మ్యునిసిపాలిటీల వారిచేత బొగడబడియున్నవి.

ఈ రాజధానిలో నీకలరావ్యాధికై యుపయోగించెడు మందులలోనెల్ల మా కలరామందులు శ్రేష్ఠమైనవని ఖ్యాతివహించెను.

మామందులుకలచోట కలరా లేదనియే నమ్మవచ్చును. మేము అనేక వేల జనులకు ఇచ్చి చూచి దీనిమహిమను దెలిసికొనియున్నాము - అనుట అతిశయోక్తిగా నెంచకూడదు. పసిబిడ్డలు మొదలు పెద్దలకును, గర్భిణీ స్త్రీలకు కూడా నుపయోగించనగును. ఇతర మందులవలె మాత్రము బంధించుట మొదలగు దుర్గుణములులేవు.

| | | |
|---|---|---|
| కర్పూరాద్యరిష్టం | 0-8-0 | } అ. |
| విషూచిసంజీవని | 0-4-0 | |

ప్యాకింగు పోస్టేజి ప్రత్యేకము.

**ఆయుర్వేదాశ్రమం, జి. టి., మదరాస్.**

